1 TPLB101B170

# కలిక

కథామాలిక

బొడ్డు బాపిరాజు

శ్రీ వేమన గ్రంథాలయము,
తేలప్రోలు.

చలువ గాలుల, విచ్చి-విచ్చని జిలుంగు
టలరు రేకులు క్రొందవి రాకు సజ్జ,
బెళుకు తళుకు గుబాళింప; తెలుగు తోట
కులుకు లూరించు నీముద్దు కలిక సఖుఁడ!

శ్రీ [illegible] గ్రం[illegible],
[illegible]

# క థా స

అతీతం

దొంగదమ్యాలు

విధి

కిటికీ రెక్కలు

ఏకోదరులు

పరీక్ష

విస్మృతి

చిల్లి చెంబు

పుణ్యాత్ములు

# అతీతం

గులాబీ వొకర్ని అన్వేషించి వుంచుకొని వికసించడం లేదు. ఒకస్థలం నిర్దేశించుకొని మెరవడంలేదు క్షణ ప్రభ. ఒకరి కోసమనిగాని, వొకపనికనిగాని లేకుండా నరసమ్మలో నూత్నయౌవనం పొటమరించింది. ఆపిల్లకు అందం తెచ్చిపెట్టినవి బారెడు వెంద్రుకలు చేరెడుకళ్లు. నరిసి సుబ్బిగాని కూతురు. సుబ్బిగాడంటే తెలియనివాళ్లు లేరు. అతని నిత్యకృత్యం ప్రతీగడప యెక్కిదిగటం. అత నికి రెండుకళ్ళూ నరిసి. అతని పాటకు తల్లుల చన్ను గుడిసే పిల్లలు తాళంవేస్తారు. అందుకనే అతనికి యేకా దశినాడు కూడా అన్నం దొరుకుతుంది. అతని చరి త్రలో మొదటి ఆశ్వాసాలు యెంత రసవంతాలో యెవ రికీ తెలియదు.

నరిసి చిన్నప్పటి నుంచీ సుబ్బయ్య చేతుల్లో పెరిగింది. కష్టాలు చవిచూచింది—చిన్నతనంనుంచి లోకమంటే యేమిటో తెలియక పోయినా, అది తమకు అక్కరకు రానిదని గ్రహించింది. తండ్రికి దృష్టి కరవై నప్పటినుంచి అతని కన్నివిధాలా కొడుకులాగా కూతురు లాగా వుపకరించింది. పిట్టలతోపాటు యింత చలిది తిని తండ్రిచేయి పుచ్చుకొని మెల్లగా బస్తీకి నడిపించుకొని వెళ్ళడం, యింకా పడమటిదిక్కు యెర్రపడకముందే బియ్యంతో నిండిన జోలి భుజాన వూగించుకొంటూ గూటికి చేరుకోవడం, ఇది ఆబిడ్డ నొసటనున్న వుద్యో గం. వొక సంవత్సరం క్రితం వరకు వారివృత్తి కాల చక్రాన్ని రాసుకుంటూ యీవిధంగానే గడిచిపోయింది.

సుందరశివం కన్పించిన రోజున వారి జీవితాకాశంలో నొక క్రొత్త చుక్క వెలిగింది.

సుందరశివం మొదటినుంచీ చాలా దుడుకైన మనిషి. అతన్ని చుట్టాలు కూడా చాలా అపహాసంగా చెప్పుకుంటారు. అతనికళ్ళు చాలా చోరవగలవి. కపటం గల మనిషి ఆచూపుల్లో సుడి తిరుగుతాడు. అపారమైన ధనసంపద కతను కర్త. తల్లిని, తరువాత తండ్రిని కోలుపోయాడు. యాజమాన్యం అంతా మేనమామ చేతిలో పెట్టి అతను తన సంకెలను విప్పుకున్నాడు. అతనికి సారస్వతంలో మంచి పలుకుబడి వుంది. అతని రచనలు లోకాన్ని నడిపించేవిగా వుంటవి. అతని పద్యాల్లో నిర్భయత్వం వెల్లివిరిసి వుంటుంది. ఇంతకూ అతను యిరవై హేమంతాలు కడముట్టని యువకుడు. మొత్తానికి బత్తాయి చాకు.

సుందరశివం చావడి ప్రక్కగదిలో కూర్చుండి వుదయాన్నుంచీ విడువకుండా యేదో వ్రాసుకుంటున్నాడు. కిటికీ తలుపు తెరుచుకొనేవుంది. పుష్యమాసం ప్రారంభమో యేమో కిటికీలోనుంచి వచ్చే ప్రొద్దుటి యెండ అతనికి వెన్నెలవలె హృదయంగమంగా వుంది. ఇంతలో కమ్మని కంఠం వినిపించింది. అది పనిమాన్పించి అతన్ని తనవైపు కాకర్షించుకొంది. అతను కుర్చీ కదలకుండానే మనస్సంతా చెవుల దగ్గరకు పంపాడు. పాట చెవికైనకొద్దీ అతను లేచి గుమ్మంలోకి వెళ్ళాడు. మూసలాడు, ఎదురింటిముందు పద్మాలుగెంట్ల పడుచు. అతని సుష్కించిన కంఠంలోనుంచి అమృతవాహిని ప్ర

హించు కొస్తూవుంది. గడపమీద చెయ్యివేసి అలా వింటూ నుంచున్నాడు సుందరశివం. గంటలు గడిచినా ముసలివాని కంఠంలో జీరపుట్టలేదు. సుందరశివం ఆకారంలో చలనం కలగలేదు. నరసి కూడా వొక దేవతామూర్తి సన్నిధానంలో నిలబడివున్నట్లు నిశ్శబ్దంగా వుండిపోయింది. వేడెక్కిన సూర్యకిరణాలు సూటిగా అతని కళ్ళల్లో గ్రుచ్చుకొని అతన్ని మెలుకవలోకి తెచ్చినై. ఇంకా ముసలాడు పాడుతూనే వున్నాడు. సుందరం వాళ్ళిద్దర్నీ లోపలికి పిల్చుకొనివచ్చి కూర్చోబెట్టాడు. అప్పటికే కరకరా ప్రొద్దెక్కింది. అది మామూలుగా తాను భోజనం చేసేవేళ. వంటవాడు పిలువవచ్చాడు. సుందరానికి మెదడులో యెన్నో భావతంత్రులు రాగాలు వినిపిస్తున్నాయి. అతను నౌకర్ని పిలిచి అతిథులిద్దరికీ స్నానానికి యేర్పాటు చేయమన్నాడు. అతని మనస్సులో యెన్ని మెరుపులు మెరుస్తున్నాయో!

భోజనానంతరం పిమ్మట ముసలివాడు వివరంగా తన కథ వినిపిస్తున్నాడు. సుందరం వూకొడుతున్నాడు. అతని జీవిత స్రోతస్సులోని చిన్న చిన్న బుడ్బుదాలు పెద్ద పెద్ద సుడిగుండాలు వొక కన్నీటిగాథలాగా వివరిస్తున్నాడు. సుందరం ఆవన్నీ తెలిసిన హృదయంతో వింటున్నాడు. నరసమ్మ సుందరాన్ని దేవతలాగా వొకసారి, యీఘటనఅంతా స్వప్నంలాగా వొకసారీ చూస్తూ వింత వింతగా ఆగదినంతా పరికిస్తూ వుంది. ముసలివాడింకా తనకథ చెబుతూనే వున్నాడు. సుందరం

వూగొడుతూనే వున్నాడు. తన యేభైయేడేళ్ళ ప్రాయంలో దారిద్ర్యంతో ప్రారంభమైన పదియేడేళ్ళ కథనూ వొక్కమాటలో తేల్చి వూరుకున్నాడు.

సుందరం మూడు ముక్కల్లో తాతకు తన పరిచయం చేశాడు. 'తాతా!' అన్న పిలుపుకు ఆముసలి జీవి అంతరాత్మ సంతోషంతో వుక్కిరి బిక్కిరయింది. సుందరాన్ని అతను లోలోపలనే దీవించాడు. కొంతసేపూరుకున్నాక సుందరం 'తాతా! యిది మొదలు యింటిపేరుకు మిగిలిననాతో నీకుటుంబస్థులం ముగ్గురం' అన్నాడు సుందరం. ఆమాటకు వొక్కసారిగా తండ్రీ కూతురు యిద్దరికళ్ళూ చెమ్మగిల్లాయి ఆనందంతో. తలపైకి చేతులెత్తి తాత యేదో గొణిగాడు. గదంతా నిశ్శబ్దంగా ప్రార్థనా మందిరం మాదిరిగా వుంది.

సుందరశివం కవిత్వంలో పూర్వానికీ యిప్పటికీ చాలా వ్యత్యాసం ద్యోతకమవుతూవుంది. అతని ప్రతి గీతంలోనూ పూవుల్లో వున్న కమ్మదనం, వెన్నెల్లో వున్న చల్లదనం, మలయానిలంలోని సౌకుమార్యం స్ఫురిస్తూవుంది. ఇదివరకున్న నిస్పృహచ్ఛాయ మరుగైపోయింది. విచ్చిన తమ్మిపూవులో మధురసం తొణికిసలాడుతూ వున్నట్లు అతని పద్యంలో విశ్వప్రేమ తలమునుకలుగా వుండేది. అతని రచనల్లో వొక అనిర్వాచ్యమైన ఆత్మజ్యోతి ప్రకాశించుతూవుంది. యీక్రొత్తదికి అతనికీ తగిన హేతువు కనబడకుండా వుంది. అతనికి పూర్వయిల్లంటే అరణ్యం. ఇప్పుడు నందన వనం. తాతతో కబుర్లు చెప్పుకోవడమన్నా నరసమ్మతో

పిచ్చాపాటి సాగించడమన్నా అతనికి తగని సరదా.

సుబ్బయ్యా నరసమ్మ సుందరం జీవితంతో అతు క్కొనిపోయారు. వాళ్ళకది రానురాను తమ సంసారం లాగా అయిపోయింది. తమకు సుందరం ఆశ్రయమిచ్చిన క్రొత్తలో వేరే వొక లోకంలో సంచరిస్తూ వున్నట్లుం డేది. సుందరాన్ని నిత్యం దీవించని నిమిషం, ఔదా ర్యాన్ని పొగడని గడియా వుండేదికాదు. అటువం టప్పుడు 'మీారు పొగిడి నన్ను చిన్నబుచ్చవద్దు' అన్న సుందరం మాట నోటి కుట్టయిపోయేది.

సుందరం వాళ్ళ కాశ్రయమిచ్చి కాల చక్రంలో వొక ఆకు తిరిగింది. మొదట్లో వీళ్ళ నింట్లో చేర్చినం దుకు వూళ్ళో కొంత ప్రతికూలవాయువు వీచింది. చుట్టాల్నికూడా కొంత అలజడిపెట్టి వూగించింది. కొం దరు పెద్దల మనుకొనేవాళ్లు హితోపదేశాలు వల్లించి తమ సంఘాభిమానాన్ని ఋజువుచేసుకొన్నారు. ఆ వారి హితోపదేశాలు కుడిచెవిలో బడి యెడంచెవి నుంచీ మార్గం చూచుకొనేవి. మరి కొందరు ఘ రానా మనుష్యులు కులాన్ని చూపి బెదరించారు. అతను మొరాయిస్తూ 'నాకీ దిక్కులేని కులంతోనే పనిలే' దన్నాడు. చివరకా వజ్రాయుధంకూడా గడ్డి పరకకంటె చులకనయిపోయింది. ప్రపంచంలో అతను గౌరవించే వ్యక్తల్లా వొక్కడే అనుకున్న మేనమామ కూడా చెప్పాడు 'వాళ్ళని యింట్లోనుంచి సాగనంప' మని. విన యంగా చేతులు పట్టుకొని 'మామయ్యా! యీా విష యంలో మీారు పెదవులు విప్పవద్దు. నాచేత విన నని

పించుకోవద్దు!' అని ఖండితంగా చెప్పాడు. ఇక ఆయన పల్లెత్తు మాట అనలేదు. ప్రపంచంలో పుట్టిన కలవరం ప్రపంచంలోనే అణిగిపోయింది—సముద్రంలోని తుపాను లాగా. లోకాని కెంత కర్కశంగావున్నా ధనవంతుడై పుట్టిన అదృష్టంచేత ఆ యిరవై యేళ్ళ పడుచువానిః కాదనలేక పోయింది సంఘం; ప్రపంచమున్నూః

*          *          *

అది ఆషాఢం. శుక్లపక్షం—

మేడకంటుకొనివున్న తోటలో విచ్చిన రేరాణి పూలగుత్తులు కోస్తూవుంది సరసమ్మ. వెన్నెల, హేమంతంలోని తొలివేకువ ప్రొద్దుల్లో కప్పే మంచు పొగలాగా ఆచిన్నదాని కుచులమీద దట్టంగా పడుతూ వున్నది. ఆనాడే తలంటుకోవడంచేత కేశములు వదులు వదులుగా అల్లిన జడలోంచి చివర్లు రవగాలికి యెగు రుతూ చూస్తానికి పిలుస్తున్నాయి. సుదీర్ఘమైన ఆ జడ ఆమె అందాన్ని రెట్టిస్తూవుంది. సన్నగాలికి పుల్లిపార వంటి పైటచెంగు మిలమిల లాడుతూవుంటే, నాగు బాములాగా వాలుజడ తళతళ లాడుతూవుంది. పైట కదలికలోనో, జడ మెదలికలోనో చెప్పలేంగాని తరచి చూస్తే రెంటివల్లా రెండుకళ్ళు చిక్కులుపడుతున్నాయి. పువ్వులు కోయటానికి కదిలేచేతుల గాజుల ధ్వనిని శృతి చేసుకొంటూ వొకహృదయం మూగపాట పాడుతూ వుంది.

సుందరశివం మేడమీది గదికిటికీలోనుంచి అని మిషుడై సరసమ్మ యౌవనలక్ష్మిని వుపాసిస్తున్నాడు.

వచ్చి సంవత్సరమైనా యింతవరకూ నరసమ్మను ఆ దృష్టితో చూడడానికంటూ అదే మొదలు. ఇన్నాళ్ళనుంచీ పెరిగిన పరిచయం వొక్కసారిగా యిలామారడం అతనికే వింతనిపించింది. ఆ పచ్చని చెట్లలో, ఆవిచ్చిన పువ్వులలో, చల్లని వెన్నెట్లో, మెల్లనిగాలిలో, అనంత నీలాకాశంక్రింద ఏకాంతంగా ఆవిడొక సౌందర్య దేవతలాగా కనబడ్డదంటే అతని దోషంలేదు. ఆదోషం నరసమ్మ రూపానిది. ఆమాటకువస్తే సృష్టించిన బ్రహ్మదేవుడిది.

అతని బుర్రలో ఆపిల్ల వొకసారి వరూధిని, వొకసారి గిరిక, వొకసారి శకుంతల వొకసారి......ఇంకా యింకా పుస్తకాల్లో అందం చూపించే ప్రబంధనాయికీమణులందరిలాగా తలపులు రేపుకొచ్చేది. ఎన్నడూ లేని వొక వికారం, వొక వేదనా కలిగింది. ఇంతవరకూ అతని పద్యాలతో అర్చింపబడుతూవున్న వొక నిరాకార ప్రణయాధినేత్రి సాకారంతో ప్రత్యక్షాన కుసుమాంజలినై స్వీకరించి అమూల్యమైన తన హృదయాన్ని అర్పిస్తూ వున్నట్లుంది. అతని భావనాపథం అనంతమైపోయింది. అతని చూపులుమాత్రం కదిలే పైటచెంగుల్ని విడిచిపెట్టి రావడంలేదు. అతని మనస్సంతా ఆ వినీలవేణి బంధంలో వలసుకుపోయింది. అతని ఆత్మపారవశ్యానికి మందానిలం కొంత తోడై వచ్చింది. నరసమ్మ వెనక్కు తిరిగింది. హఠాత్తుగా కళ్లు నాలుగైనాయి. తల వంచుకొని వొక్కగంతున నరసమ్మ పెరటిగుమ్మం దాటి యింట్లో పడ్డది.

సుందరం భావనలో అకాలవసంతం దాపురిం చింది. అతనికి జీవితమాధుర్యం కట్టెదుట ప్రత్యక్షమౌ తూంది. అతని చూపుల్లో వొక వింతకాంతి ప్రతిఫలిస్తూ వుంది. అతని ఆనంద సింహాసనం అతని గదిలోనే వుంది. వలచిన కన్యను పెండ్లిచేసుకుంటానికి అతనికి సందేహం లేదు. ప్రపంచంకోసం తను భావదాస్యం చేసేరకం కాదు. తనకు నచ్చినది జరిగి తీరవలసినదే. మనసులోని విషయం తొందరపడి వెల్లడిచేయకుండా కొన్నాళ్లు ఆలో చించి వొక దారికోసం తంటాలు పడ్డాడు. తన కోరిక దూష్యం కాదనుకొన్నప్పుడు నీతిలేని లోకంకోసం అన్యథా చరించటానికి అతని ఆత్మ సమ్మతించిందికాదు. ఇక ఈవిషయం ముందెవరితో కదిలిపి చూడాలో, అన్నదే అతని ప్రస్తుత సమస్య; తండ్రితోనా? కూతురి తోనా? తుదకు కూతురితోనే అని నిర్ధారణ చేసుకు న్నాడు. వాళ్లిద్దరి సమ్మతీ అయిన వెనుక లోకానికి వెల్లడించాలని అతని సంకల్పం.

గదంతా నిశ్శబ్దంగా వున్నది. కిటికీలోనుంచి వెల్తురు వస్తూవుంది. అతను కళ్లుమూసుకొని వున్నాడు. మన సే కవితాసామ్రాజ్యంలో విహరిస్తూవుందో! కాదు కాదు—దానికి కావలసినంత నిశ్చలత నిశ్వాసంలో కన్పిం చడంలేదు. ఆవూర్పుగాడ్పులోని వెట్ట అతని గుండెల్లోని కలవరం పైకి తెంతూవుంది. నరసమ్మకు తనప్రేమవృత్తాం తం వినిపిస్తానికి పూనుకున్నాడు. ఆయూరాటమే అతని సర్వశరీరంలో ద్యోతకమౌతూవుంది. ఆమెచెప్పే జవాబు వూహించడానికి అతనిసర్వశక్తులూ పనిచేస్తూవున్నాయి.

కొంతసేపటికి బహిర్ముఖాలుగా పరుగెత్తే ఆలోచనల నన్నిటినీ వొకటిగా ముడివేసి గొంతుక సవరించుకొంటూ మధురాతిమధురంగా పిలిచాడు.

"నరుసూ! నరుసూ!!"

* * *

తనలోవున్న సంయమనాన్నంతా కేంద్రీకరించుకొని తన్ను తాను సంభావించుకొన్నాడు సుందరశివుడు. "అన్నా, తప్పంటే క్షమించు తెలియని మూఢురాల్ని" అని అతని కాళ్ళదగ్గర కూలబడి వెక్కి వెక్కి యేడుస్తూ మొగం చేతుల్లో కప్పుకుంది నరసమ్మ. "చె-ల్లీ-!-" ఆ పిలుపుతో అతని హృద్భారం అంతా తీరిపోయింది. "నీ ప్రణయం సత్యమైంది. నీ జీవితాన్ని ఆదర్శవంతంగా చేసుకొన్నావు. ధన్యవు!" అన్నాడు. అతని ముఖం వర్షం కురిసిన తరువాత తెరపిన పడ్డ ఆకాశంలాగ ప్రశాంతంగా, ఛాయారహితంగా వుంది.

నరసమ్మ తన చిన్నతనం నుంచి రాముడితో కలిసీ మెలిసీ వుండేది. రాముడంటే వొక అనాథ భిక్షుకురాలి యేకైకపుత్రుడు. తండ్రిని తీసుకొని నరుసూ, తల్లిని తీసుకొని రాముడూ వూళ్ళోనుంచి రావడంతోనే ఆవూరి బయటి పెద్ద రావిచెట్టు కింద కూర్చుండి ముచ్చట్లాడు కొనేవారు. రాముడు తల్లికూడా నరుసును కూతుర్లాగాచూస్తూ ఆ పిల్లపనుల్లో ముచ్చటైక తన చేసేది. ఆ బాల్యబంధువు లవటంచేత వాళ్ళ మానే నవు తొలి ప్రొద్దుల్లోనే వొకళ్ళకి వొకళ్ళు హృదయాలు అర్పించుకొన్నారు నరుసూ, రాముడూను. అప్పుడే

అంటూ వచ్చి నరసమ్మ అతని ప్రక్కన కూర్చుంది. సుందరం నవ్వుతూ 'చెల్లీ! నీయిష్టం తీర్చినట్లేనా?' అన్నాడు. "ఒక్కటి తప్ప" అని వూరుకుంది నరసమ్మ. "చెప్పు చెల్లమ్మా! తప్పక తీరుస్తాను!" అన్నాడతను సామర్ద్యాతో.

"మా వివాహంతో పాటు మీదికూడా; అంటే మీకు కుదిరిన తరువాతే మాది తలపెట్ట మన్నమాట" అని వూరుకుంది.

ఆ మాటకు అతని అంతరాత్మ కళవళ పడింది. తనెవరి సుఖం, యిష్టం కోసం హృదయం భగ్నంచేసుకొన్నాడో ఆ చిన్నదాని యిష్టంకోసమే తిరిగీ వివాహానికి సిద్ధమైనాడు మారు మాటాడక.

"సరే, చెల్లీ! నీ యిష్టం యెట్లావుంటే అట్లాగే కానియ్యి."

# దొంగ దయ్యాలు

ఆదివారం. వుదయం 9 గంటలు.

నారాయణరావు చాలా గలాటా చేస్తూ వున్నాడు. ఏదో పోయిన వస్తువు కని వెదుకుతూ వున్నట్టున్నాడు. గదిలో సామానంతా చెల్లా చెదరుగా విరజిమ్మి వేశాడు. నిన్న ఆఫీసుకు వేసుక వెళ్ళిన వూదా రంగు కోటు జేబులు తనికీ చేశాడు. మళ్ళీ దొరకకుండనే ఆశతో లోపలి జేబులుకూడా గాలించి వేశాడు. ఆకోటులోవున్న ప్రతిపోగునూ నిదానించి చూ

చాడు. పోయింది మాత్రం దొరకలేదు. కోపంకొద్దీ కోటు విసిరివేశాడు. అది జడిసి గదిగుమ్మం దాటి మూడు గజాల దూరాన్నపడి బ్రతికాననుకొంది. మళ్ళీ అతని చేతుల్లోకి నిన్నటి చాకల కమీజు వచ్చింది. అది అతని చేతుల్లో ముద్దై కోటుకంటే రెండుగజాల ముందుకు దూకింది ఆత్మసంరక్షణకోసం. పాపం! నిర్దోషి అయినా బనీనుకూడా అతని మొరకు చేతుల్లోనుంచి యెగిరి ఇవలపడే తొందరలో గదితలుపుకు మెడతగులుకొని అలా వ్రేలబడి పోయింది.

నారాయణరావు ఒక్కసారిగా లేచి టేబిల్ సొరుగు చూశాడు. అందులో కనబడ్డవి—తగరం చంచాలు రెండు. జడకు గుచ్చుకొనే హుక్సు. పూలదారం. ఇంకా యీ తరగతికి చెందిన చెత్తా చెదారం. అంతేకాని అతను వెదికే వస్తు వందులో కన్పించలేదు. అవిచూచి వొడలుమండి వాటిని వొకటొకటిగా తీసి విశాల ప్రపంచంలోకి విసరి పారవేశాడు. ఆచీకటిఖయిదు తప్పిందని అవి సంతోషించాయి.

అక్కడనుంచి బీరువాదగ్గరకు వెళ్ళాడు. బీరువాలో కన్పించలేదు. పరుపు క్రింద చూచాడు. అక్కడ లేదు. బట్టల ట్రంకులో చూచాడు. అందులో లేదు. గోడబీరువా తెరచి చూశాడు. దాంట్లో కన్పడలేదు. అతనికేమీ తోచక గది టాపుకేసి చూచాడు. అక్కడా లేదు. ఆచూపు గోడలమీదకు ప్రాకించాడు. అక్కడా ఆచూకీ దొరకలేదు.

కళ్ళు రెండూ గట్టిగా మూసుకున్నాడు. ఆలోచనా సముద్రంలోని యే వొక్క చిన్నతరంగం కూడా అతని వస్తువును పైకి తెచ్చి గట్టుమీదకు విసరలేదు. కాని, దాని ఆకారం మాత్రం కళ్ళముందు వ్రేలాడ వేసుకొన్నట్లు కనిపిస్తూనే వుంది. అది చూస్తూ వుండగానే తెరమీది బొమ్మలాగా మాయం అయిపోయింది. స్వరాజ్య సంపాదన విషయంలో గాంధీజీ ముసలి బుర్రలో సుడి తిరిగే క్రొత్త మార్గాలకంటే ఆ నిమిషంలో నారాయణరావు మెదడులో చాలా విషయాలు కొట్టు మిట్టాడుతూ వున్నాయి, ఆ పోయిన వస్తువును తిరిగి సంపాదించడానికని.

సరిగా ఆ సమయానికి నారాయణరావు అర్ధాంగం శారద గదిలోనికి వచ్చింది. గది నంతా అరణ్యం లాగా మార్చిన తనమగని తెలివికి కాబోలు వొక చిన్న నవ్వు నవ్వింది. ఆవిడ అదృష్టం తిన్నగా వున్నది కాబట్టే ఆ నవ్వు నారాయణరావు కండ్లబడలేదు. "శారదా! నా కోటు జేబులో యిరవై రూపాయిలు అంటే రెండు పదిరూపాయిల నోట్లు—"

"ఆగండి. నంబర్లు జ్ఞాపకం వున్నాయా?"

"—నువ్వుచూచావా?"

"—మీరు చూపించితేగా? మళ్ళీ క్రొత్తరకం మారాయా? వెధవ కాగితాలు గంట కొకరకం, గడియ కొకరకం, మారుతూ వుంటాయి. ఏవీ చూపండి యీ సారి యెట్లా వున్నాయో!"

"మాట వినిపించుకోవేం! నిన్న జీతం యాభై

రూపాయీలు తీసుకొని యింటి అద్దె అతనికీ, మన బియ్యం షావుకారికీ, చిల్లర వాడకం అప్పలస్వామికీ, సరిపెట్టగా మిగిల్నవి యిరవై రూపాయీ లుండాలి. అవి ప్రొద్దుటనుంచీ వెతుకుతున్నా కనబడటంలేదు. నువ్వేమన్నా—"

"కోటెక్కడ తగిలించారు?"

"మామూలుగా తగిలించే గదిలో వంకీకే."

"మీరక్కణ్ణుంచి వచ్చేక చూచుకున్నారా? కోటు తగిలించేముందు. జ్ఞాపకంచేసుకోండి."

"ఆఁ."

"మీరు జీతం తీసుకొనేటప్పుడు యెవరన్నా తుమ్మారా?"

"తుమ్మాలేదు, దగ్గాలేదు. ఏమిటి యీ క్రాస్ చెయ్యడం!"

"రెండూ కనిపించడంలేదూ?"

"రెండూనూ."

"అయితే యింకేం. దొంగదయ్యాలన్నమాట! సందేహం యెందుకు యింకా?"

"దొంగదయ్యాలేమిటి? ఏమిటో లేనిపోనివి తెచ్చి పెడతావు నువ్వెంతా."

"పోనీలెండి! నాకెందుకు? మాట్లాడను."

"దొంగదయ్యాలేమిటి? చెప్పుమరి."

"...................................."

"మాట్లాడవేం? ప్రొద్దుటనుంచీ వాటికోసం వెదికి వెదికి ప్రాణం సొమ్మసిల్లిపోయింది. చూడు! చెమటెల్లా

పోస్తూవుందో."

"......................"

"చాల్లే విసురుకుగాని, ఫరవాలేదు, పుల్లాడు! దొంగదయ్యాలేమిటి? వేధించక త్వరగా చెప్పుదూ."

"దొంగదయ్యాలని అదోజాతివి. కొన్నిదయ్యాలు మనుషుల్ని పీడించుకు తింటాయి. అల్లాగే యీ దొంగ దయ్యాలు యింట్లో సామాన్లు, జేబుల్లోడబ్బులు, పెట్టెల్లోబట్టలు, అన్నీ మాయంచేస్తూ వుంటాయి. మొన్న ఆ పుల్లమ్మగారింట్లోనూ అంతే. వాళ్లో అప్పుడు మెళ్ళల్లో నగలుకూడా తెంపుకుంటాయి."

"ఛా! వెధవకబుర్లూ నువ్వూను—"

"మరి చెబితే నమ్మరు. మొన్నమీరు చూస్తూ వుంటేనే అరుగుమీది నేతిగరిట యెత్తుకపోయిందా లేదా?"

"నేతి గరిట యెత్తుకపోయింది కాకి గదూ! ఆరోజున."

"మరి మీ పిచ్చి మీదే యిక. కాకేంటి? కాక్కి నేతి గరి టెందుకు? దొంగ దెయ్యమంటే అదే. దానికి వొక రూపంటూ యేమిటి? కాకీ అదే, కుక్కా అదే. మొన్న సబ్బుబిళ్ళ పెట్టి నోట కరచుకొని పోలేదూ? అప్పుడు కాకయింది, ఇప్పుడు కుక్కయింది. అంతా ఆ దొంగ దెయ్యమేను. ఇవ్వేళ మీ జేబులో యిరవై రూపాయిలు కూడా దాని పరమే. ఇంకెందుకు వెదకడం? అనవసరం. ఒక దండం పెట్టి వూరుకోండి!"

"అంతే నంటావా?"

"ముమ్మాటికీనీ."

౨

నారాయణరావు చాల సౌమ్యుడు. అనగా అమాయకు డనే మాటకు పర్యాయ పదమన్నమాట. బి. ఏ. వరకు చదివినా వేదకాలంనాటి విప్రుడు లాగా వుంటాడు. ఇంపీరియల్ బ్యాంకిలో గుమాస్తా పని నిర్వహిస్తున్నాడు. నెలకు యాభై రూపాయిల జీతం. భార్యా భర్త యిద్దరు. శారదకూడా యిప్పటి నాగరిక ప్రపంచానికి అలవాటుపడ్డ వ్యక్తి అయినా చదువు కున్నది కావడంవల్ల సంసార నిర్వహణంలో చాలా పొదుపు గల మనిషి. నెలకు వచ్చేవి యాభైరూపాయిలు. ఇంటి అద్దె దీఫిలు నెలకు కర్చు పాతిక రూపాయిలు తప్పితే మిప్పైమించికాదు. యాభైలో ముప్పై మినహాయిస్తే నిల్వ యిరవై రూపాయిలు. కాని ఫ్రెక్క దమ్మిడీ మిగలదు నెలవచ్చే టప్పటికి. ఎట్లా కర్చవు తుందో చాలా వింతగా వుండేది. నారాయణరావు కే విధమైన దుర్వ్యసనాలు లేవని అవిడకు బాగా తెలుసు. తెలిస్తే మాత్రం యేం? తెచ్చిందానికి తిన్నదానికి హాళ్ళికి హాళ్ళీ, సున్నకు సున్నా. ఏనెల కానెల అలానే గడచి పోతూ వుంది.

నారాయణరావు వుత్త మొగమోటము పడే రకం. స్నేహితులకుకూడా యితనితత్వం తెలిసివచ్చింది. ఆఫీసునుంచి పదిమంది స్నేహితులూకలిసి యింటికి వెళ్ళ నప్పుడు యేఆదర్శప్రాయుడో త్రోవతీస్తే అంతా కాఫీ దేవాలయాన్ని ప్రవేశించేవారు. స్నేహబృదం అంతా

యేరూపాయిన్నరకో బిల్లు వ్రాయించేవారు. ఆమొత్తాన్ని మోమోటంకొద్దీ నారాయణరావుయిచ్చి చెయ్యి కడుక్కునేవాడు. ఏస్నేహితునికన్నా అవసరంవస్తే "బ్రదర్! నాలుగు రూపాయలుంటే యిస్వూరా, యీనెలా ఖరున నీకు సరిపెడతాను." అంటే మాట త్రోసివెయ్యలేక జేబులోవితీసి యిచ్చేవాడు. గడువు ప్రకారం నెలాఖరు వచ్చేది. అడగటం యితనికి నామోషి, యివ్వడం అతనికి కష్టం. చివరకు వస్తువు కాలగోషం వచ్చేది. ఎట్లాగయినా నారాయణరావున్ను కదిలించి సినిమాకో నాటకానికో బయలుదేరదీశారా, ఆరోజున జేబులో డబ్బు లేకపోయినా ఫరవాలేదన్నమాటే స్నేహబృందానికి.

ఈవిధంగా నెలజీతం యింటివారికి సగం, పైవారికి సగం సరిపోయేది. అన్ని విషయాలూ తెలుసుకొని వున్నా సమయానికి చక్కా ఆమోమోటమి వచ్చేది. ఇక దేనికీ కాదనలేకపోయేవాడతడు.

కొన్నాళ్ళ నుంచీ నారాయణరావు యింట్లో దొంగదయ్యం తిరుగుతూ వుంది. అది రోజూ యేదిచిల్లర దొంగతనమో చేస్తూనే వుండేది శతవిధాల భార్యాభర్తలిద్దరూ వేయికళ్ళతో కనిపెట్టుతూ వున్నప్పటికీ యేట్లాగో ఆదయ్యంకొస్తా తనపని ముగించుకొని పోయేది తనరెండో కంటికి తెలియకుండా. నారాయణరావు జేబులో రెండు రూపాయలుంటే అందులో ఒకరూపాయిమాయం చేసేది. ప్రతినెలా జీతంలోవి పదిహేనో యిరవైరూపాయిలో మాయంచేసివేసేది. నారాయణరావుకు దాని పేరు చెబితే హడల్గా వుండేది. మధ్యమధ్య శారద

నారాయణరావు విశ్రాంతిగా కూర్చున్నాడు. ఆ రోజు ఆఫీసుకు సెలవు. మామూలుగా ఆఫీసుకి వెళ్లే అతను ఆదివారంనాడు ఎనిమిదికొట్టేదాకా ప్రక్క విడిచిపెట్టడు. వారానికి ఆ ఒక్కరోజే స్వేచ్ఛగా గాలి పీల్చుకోనేందుకు. దానికోసం ఉద్యోగస్థులందరూ శనివారంనుంచే కనిపెట్టుకొని వుంటారు. ఆదివారం రాక పర్వం.

అప్పుడే స్నానంచేసి తెల్లని చాకింటి మడతలు కట్టుకొని పేముకుర్చీలో కూర్చుండి చదువుకొంటున్నాడేదో పత్రిక. చిన్న స్టూలుమీద కాళ్ళుచాచుకొని తాపసులాగా తలవంచి చదువుకొంటున్నాడు. శివుని తపస్సు భంగమైనట్లు శారద గదిలోకి రావడంతోనే అతని ఏకాగ్రత వికావికలయింది. శారదనుచూచి అతను స్టూలుమీదనుంచి కాళ్ళుతీసి సరిగా కూర్చున్నాడు కుర్చీలో. శారద వెండిగ్లాసుతో కాఫీ తెచ్చింది. అది స్టూలుమీదపెట్టి వేడి తగ్గేందుకని విసనకర్రతో విసురుతూ దానిప్రక్కన ప్రక్కవాటుగా కూర్చుంది. ఇంక చదువెట్లాగూ సాగదని పుస్తకంతీసి టేబిల్ మీద పెట్టి వింతమనిషిలా "శారదా! కబుర్లేమిటి?" అన్నాడు.

శారద గొంతు సవరించుకొంటూ—

"రాత్రిసంగతి నేనే చెప్పాలని అనుకుంటూ వుండగా మీరే అడిగారు" అన్నది నెమ్మదిగా.

"అల్లాగా! దేవిగారికిప్పటికి జ్ఞాపకం వచ్చిందన్న మాట మాగొడవ. ధన్యులం!" అన్నాడు కడుపులో చల్ల కదలకుండా. శారద ముసిముసి నవ్వుతూ చూస్తున్నది

ఆమాటకు.

"రాత్రి సంగతేమిటి?" అన్నాడు ప్రసంగాన్ని పెంచుతూ మళ్లా.

"రాత్రి నిద్రలో వొకచక్కని పన్నెండేళ్ళ అమ్మాయి కనపడి—"

"ఏమన్నా గ్రంధం వ్రాసి తనపేర కృతి యివ్వ మన్నదా యేమిటి గోల! నువ్వు పత్రికల్లో కధలు వ్రాయడం చూచి."

"హాస్యం కాదండీ! నిజంగా వినండి,—కనపడి మీయింట్లో యిప్పటికి నేను ఎంతో సొమ్ము హరించా—"

"ఆ! దొంగదయ్యం కనపడ్డదా యేమిటి? చెప్ప వేం ?"

"వినండి కడవరకు.—వానికి ప్రతిఫలంగా నా పేరుమీద నువ్వు పెట్టుకోనేందుకని గాజులజతలూ—"

"గాజుపెంకులా! యింతకూ నిక్షేపంలాంటి డబ్బు మ్రింగి గాజుపెంకులా యిచ్చింది? మంచిదయ్యమే!"

"—బంగారపు మెడగొలుసు నీబట్టల పెట్టెలో—"

"బంగారమే! బంగారం!!"

"పెట్టె వెడుతున్నానని చెప్పి మాయమయింది-"

"ఇక నేను చెబుతా. తరువాత నువ్వు వుదయమే లేచావు. అది చూచావు. అందులోనే వున్నాయికదూ? తీసుకురా చూదాం."

శారద వెళ్ళి చూచింది. అవక్కడలేవు. తెల్ల ముఖంవేసి వచ్చి కూర్చుంది. నారాయణరావు నవ్వుతూ "ఆదయ్యం అంకులోనుంచి తీసి తెచ్చి 'యిదంతా మీ

వచ్చే కనుక మీకే యిస్తే బాగుంటుంది. శారదకు మీకే యిమ్మంది. దీని మజూరీ మాత్రం ఫలానా కంసాలి కియ్యండి అని చెప్పి టేబిల్లో పెట్టివెళ్ళింది" అని తీసి శారద చేతిలో పెట్టాడు. శారద నవ్వుతూ నిర్ఘాంతపోయి చూస్తూవుంది భర్త మొగం రెప్ప వాల్చకుండా.

నారాయణరావు నిన్న ఆఫీసుకు వెడుతూవుంటే కంసాలి సుదర్శనం గాజులూ గొలుసూ తయారయి పోయినవనీ యింటికి తీసుక వెడుతున్నాననీ దారిలో కలిసి చెప్పాడు. కాబట్టి నారాయణరావుకు దయ్యం ప్రత్యక్షం అయి నగలు టేబిల్లో పెట్టి పోయింది. శారదకీ గొడవ తెలియక పోవడంవల్ల తెల్లపోవలసి వచ్చింది.

దొంగదయ్యం పుణ్యమా అంటూ శారదకు ప్రతి యేడూ యేదో వొక వస్తువు యేర్పడుతూనేవుంది. మునుపటి మాదిరిగా ఆయింటో దొంగదయ్యా లిక తిరుగడం లేదు.

---

# విధి

ఎలమంద చెప్పింది:—

నా వూహ తెలిసింది మొదలుగా నాన్నతో కంటే అమ్మతోనే యెక్కువ పరిచయం. అమ్మపేరు కోటి. అమ్మకు నేనంటే తగని ప్రేమ. గుండ్లోని ఆజాతిలో అటువంటి దయా వంతురాలు వుండడం విరుద్ధమే!

నాకప్పు డించుమించు అయిదేళ్ళ ప్రాయముంటుంది. మా ముఠాలో అందరికంటే కొంచెం అందంకలవాడిని నేనే. దుర్బలుడనూ నేనే. మావాళ్ళందరూ మత్స్య మాంసాలకు అలవాటు పడ్డ ఆసాములు. నాకంటే చిన్న వయసు గల మాలోని కొందరు యిటువంటివి పుట్టుకతోనే అభ్యసించారు. నాకెందు చేతనో వాటి పేరు వింటేనే డోకు వచ్చేది. నా యెదుట తిని త్రాగేవాళ్ళ నసహ్యించుకొంటూ వుండేవాణ్ణి. ఏ కారణమో తెలియదు కాని, అమ్మకూడా నన్ను వాటికి దూరంగా వుంచేది. ఎవరైనా కొంటెతనంగా నాకలవాటు చేయడానికి పూనుకొన్నారంటే వాళ్ళని గట్టిగా మందలించేది.

నాకు చిన్నతనం నుంచి మంచి అలవాట్లు వుండేందుకు అమ్మ చేసిన ప్రయత్నాలు యిప్పటికీ కళ్ళకు కట్టినట్లగుపిస్తాయి. ఆడవాళ్ళయితేనేం, మగవాళ్ళయితేనేం, మావాళ్ళలో చుట్టలు కాల్చనివాళ్ళు లేరు. చిన్న పిల్లలు రోడ్లవెంట పారేసిన యెంగిలి చుట్ట లేరుకొని భోగం వెళ్ళబోసేవారు. నాకూ బాల్యచాపల్యాన వాటిమీద మోజు పుట్టేది. ఒకసారి దొంగతనంగా చుట్ట పీక కాల్చాను. నాకది సరిపడిందికాదు. అన్నం కక్కుకున్నా. రహస్యం బయలుపడ్డది. చీవాట్లు సరే కదా మెన్నడూ కన్నెర్రచేయని అమ్మ ఆరోజున కొట్టినట్లుగా కూడా గురుతు. మాసంఘానికీ నాకూ పరస్పర సంబంధం వుండకుండా వుండేటట్టుగా చూసేది. నా దినచర్యనంతా వేయికళ్ళతో కనిపెట్టేది. ఆ మహాసముద్రంలో కొట్టుకుపోతూ గుక్కెడు వుప్పు నీళ్ళైనా

మ్రింగలేదంటే అమ్మ జాగ్రత్త అనాలి.

తరువాత జరిగిన విషయాలు స్మృతి పట్టిస్తుంటే అంత ప్రధానం కలవి కావు. నాకు పదేళ్లు వచ్చినప్పటి నుంచీ జీవితం ఒక విధంగా స్థిరపడ్డదని చెప్పవచ్చు. అప్పటి మా కాపురం ఏలూరులో. నేనూ, అమ్మా, ఒక చిన్న గుడిసెలో సంసారం సాగించేవాళ్ళం. మా ముత్తాలంతా ఏమయ్యారో, అప్పటి మా జీవిత విధానానికే హేతువేమో ఇంకా చెప్పలేను. అప్పటికి అమ్మకు ముసలితనం ఆవరిస్తూవుంది. కాని యేమాత్రం అలసటా ఆయాసం పడేదికాదు. గట్టి శరీరం.

అమ్మ ఒక బ్రాహ్మలింట్లో పనిచేసేది. ఒక పూట భోజనం, నెలకు అయిదురూపాయల జీతం. ప్రొద్దుట అయిదింటికి వెళ్ళేది. మళ్ళీ సాయంత్రం అయిదింటికి ఇంటికి చేరుకునేది. ఏలూరు వచ్చినప్పటినుంచి నా జీవితంలో కొంత మార్పుకూడా సంభవించింది. ఉన్నతికి అవకాశం లభించింది.

ఇదివరకే నాకు కొద్దిగా చిన్నచిన్న పేర్లు కూడ బలుక్కొని చదవడం వ్రాయడం అమ్మ కృషివల్ల వచ్చాయి. ఏలూరు వచ్చిన వెంటనే మా బ్రతుకు తెరువు యేర్పరచు కొన్నమీదట నన్నొక చిన్నబడిలో చేర్పించింది. నాకు పద్నాలుగేళ్లు వచ్చేటప్పటికి కొంచెం కొంచెం లోకానుభవం చిక్కింది. అంతవరకు రెక్కల మరుగున పిల్లలాగా మా అమ్మ అంకసీమే నా సకలమున్నూ. అమ్మనుమించి ప్రపంచంలో 'నా' అనుకోనేది లేదిక.

నేను కొన్నాళ్ళకు మున్సిపల్ హైస్కూలులో చేరాను. స్కూలునుంచి యింటికి వచ్చేత్రోవలోనే మా అమ్మ యజమానుల యిల్లు వుండేది. స్కూలు వొదిలిన వెంటనే ఆయింటికి వెళ్ళి అమ్మను కలుసుకొని యిద్దరం యింటికి పోయేవాళ్ళం. ఆరోజుల్లో చాలా సంతోషంగా మాకాలం గడిచిపోయేది. స్కూల్లో సంగతులు నేనూ, యజమానుల సంగతులు అమ్మా, చెప్పుకొంటూ ఆనందించేవాళ్ళం. మాఅమ్మ పనిచేసే యింటి యజమానురాలికి నేనంటే యెందుచేతనో చాలా కనికరం. ప్రతిదినం అమ్మకోసం వెళ్ళినప్పుడు ఆయమ్మ నాకేో తినుబండాలో, అర్ధణో అణో, యింటివారి పంచీ కండువాయో యేదో వొకటి యిచ్చేది కాని వృత్తచేతుల్తో వొకనాడూ నన్ను పంపేదికాదు. నాచక్కని రూపం. నాసౌమ్య వర్తనం, ఆతల్లి నాకర్పించి వుంట్టాయి.

ప్రస్తుతం నాకిప్పుడు పదియేడేళ్ళు. ఎంతవరకూ నాదృష్టి విద్యార్జనమీదే వుండేది. మనసిచ్చి పెంచే అమ్మ నాకే విధానా కొరత చూపించేదికాదు. నే నా అల్ప జీవితంలోనే ఆనందం తెచ్చుకొనేవాణ్ని. నాకంటే భోగ భాగ్యాల్లో అదృష్టంలో యెన్నోరెట్లు ముందడుగు వేసినా, ధనికుల బిడ్డలు చదువులో మంచితనంలో శీలంలో నాకంటే మైళ్ళకొద్దీ వెనకపడ్డారు. ఆరోజు సాయంత్రం బడిలో కొంచెం ఆలస్యం అయింది. నేను వచ్చి మామూలుగా ఆబ్రాంహ్మల యింట్లో "అమ్మా!" అనిపిలిచాను. "ఓయ్" అంటూ యజమానురాలు ఆరోజున వండుకున్న యేదోరొట్టె చేతులో పెట్టి, కోటి

కొంచెం జ్వరం తగిలినట్లుండడంచేత యింటికి ముందు గానే వచ్చింది" అన్నది. ఆమాటలు విని నే వెళుతూ వుంటే రమ్మని పిలిచి నాచదువు సంధ్యలసంగతీ అదీ అడిగి అప్పుడే చదువు మానవద్దనీ యేదయినా ధన సహాయం కావాలంటే యింటివారితో చెప్పి చేయిస్తా నని, యెంతో ఆపేక్షగా మాట్లాడింది.

కోటి చెప్పింది:—

మేం లంబాడీవాళ్ళం. మా మగవాళ్ళు చాలా క్రూరంగా ప్రవర్తించేవారు. నా తలిదండ్రుల నంత బాగా యెరుగను. చిన్నతనంలోనే పోయివుంటారు. అప్పట్నించీ మేనమామే నన్ను పెంచి పెద్దదాన్ని చేశాడు. చివర కతనే నన్ను పెళ్ళి చేసుకున్నాడు. నేనంటే అతనికి పంచప్రాణాలూను.నామాట కెప్పుడూ అడుగుదాటేవాడుకాడు. అతనే మాలంబాడీ తండా కంతాపెద్ద. అతడు చేసేపన్లు నాకు సుతరాం గిట్టేవి కావు. మాతండా వాళ్ళకూ నాకూ ప్రవృత్తిలోనే చాలా వ్యత్యాసంవుంది. నాకు జీవితం శాంతంగా సాగి పోవడం యిష్టం. వాళ్ళకి పూర్తిగా దౌర్జన్యం. ఇంత విరుద్ధ ప్రకృతులు గల మాదంపతుల మొకసారి కల హించి యెరుగం. అతను నామాటకెంత యెదు రాడకపోయినా, అతనంటేనే నాకు భయం భక్తీ వుంది.

ఆరోజు సంగతి యిప్పటికీ కళ్ళకు కట్టినట్లు కన్పి స్తూనేవుంది. బహుళపక్షంలో అష్టమి. మసక మసక వెన్నెల చాలా తమాషాగావుంది. శ్రావణ మాసం అనుకుంటా. కొంచెం గాలి చలిగాలిగా వుంది. మావా

ళ్ళక్కడ్నించి మకాం యెత్తివేశే రోజది. మాపని యెప్పుడూ వొక వూర్నుంచి యింకోవూరికి మారడమే. ఏవూళ్ళోనూ కాన్నిలిచి నాలుగు నిద్రలు చేసే వాళ్ళం కాం. అట్లా వుంటానికూడా మావృత్తినిపట్టి వీల్లేదు. పగలేపనులు చేస్తూనోవుండేవాళ్ళం. రాత్రుళ్ళు మావాళ్ళు చిల్లరచిల్లరగా దొంగతనాలకు బయల్దేరి పోయేవాళ్ళు. ఒకొక్కసారి దారులుకాచి కొల్లగొట్టే వారుకూడాను. మాలంబాడీ తండావెంట వొకపసువుల మంద తప్పకుండా వుంటుంది. ఏవూళ్ళో మకాంచేసినా ఆవూళ్ళోవి యేపరకో పాతికో పసువుల్ని మామందలో కలుపుకొని అర్ధరాత్రి కర్ధరాత్రి లేచిపోయేవాళ్ళం. అదేవృత్తి.

ఆరోజున గుడివాడనుంచి మకాంయెత్తి యేలూరు చేరాలని మాసంకల్పం. ఇది పదియేడు పద్దెనిమిదేళ్ళ క్రితంమాట. అప్పటికి యేలూర్నుంచి గుడివాడకు మోటార్లరస్తా యేర్పడలేదు. మా కుండా చట్టీ చంకనపెట్టుకుని ఆమసక వెన్నెల్లోపడి దారితీశాం. చల్లనిగాలి గిలిగింతలు. మావాళ్ళు యేలపదాలు. అప్పుడే వూరి పొలిమేరకువచ్చాం. ఆసన్ననిగాలి రొదలో కలిసి యెక్కడ్నించో వొకశిసువు కంఠం వినిపించింది. ఆసమయంలో ఆచోట శిసుకంఠం. నాకు సందేహం కలిగింది. నలువైపులా పరకాయించి చూచాను. రోడ్డువారనేవున్న బెల్లపుచెట్లుమొదట తెల్లనిగుడ్డల్లో గుక్కపట్టి యేడుస్తూ వున్నాడు. ఏతల్లిపాపఫలమో ఆపసికందు?

నా కప్పటికే యిద్దరు బిడ్డలు పుట్టిపోయారు.

పిల్లల్ని తల్చుకుంటే గుండె చెరువయ్యేది. ఆపోయిన పాపలకోసం మెన్నిరాత్రిళ్లు కళ్ళవెంట నీళ్ళు కారుస్తూ వాపోసినానో నాతోపాటు రెప్పవేయని చుక్కలకు తెలుసు. ఏపసిపాపను చూచినా నాబిడ్డలమీద తలపు బారి కడుపు చుమ్మలు చుట్టుకుపోగా కంటికి కడివెడు కార్చేదాన్ని.

ఆమసక వెన్నెల వెలుగులో, ఆసల్లని బెల్లపు చెట్లు పరచిన కొమ్మలక్రింద, ఆచలిగాలిలో, నిరాధారంగా, నిర్జనంగా, పడి విలపిస్తూవున్న ఆ బంగారపు తండ్రిని చూస్తే యేతల్లిప్రాణమైనా తల్లడిల్లక మానదు. ఏ పిరికి గుండెగల తల్లో చేసినతప్పును పట్టిచ్చే యీ బిడ్డను యిట్లావుంచి వుంటుంది. ఆ దిక్కులేని బిడ్డను చూస్తూ వుంటే మాతృత్వం నాలో చిగిరి మొలిచినట్లయింది. 'నా' అనేవారు లేని ఆ చిన్న రక్తపు ముద్దకు నేను తల్లిగా వుండడానికి అభ్యంతరం పెట్టేవారు లేరు. అతని కొక తల్లీ, నా కొక బిడ్డా అవసరం. భగవంతుడే మా అవసరాన్ని కనిపెట్టి యిద్దర్నీ వొక దగ్గరకు చేర్చినందుకు సంతోషించా.

నెమ్మదిగా ఆ బిడ్డను తీసుకుని అక్కున కొత్తుకున్నాను. మెళ్ళో యేదో వుంది. గుడ్డ తొలిగించి చూస్తే వొక వుంగరం కట్టి వుంది. యించుమించొక అరకాసు వరకూ వుంటుంది. దానిమీ దేవో అక్షరాలు కూడా వున్నాయి. పాపం! ఆ కన్నతల్లి తన బిడ్డడు దొరికినవాళ్ళ కవస్థ లేకుండా కొన్నాళ్ల కేనా వుపయోగపడుతుందని యీ వుంగరం కట్టి వుంటుంది.

బిడ్డంటే ఎంత ప్రేమ! అయినా రాక్షసిలాగా మీదపడే కులానికి జడిసి తన ప్రాణంలో ప్రాణం తన రక్తంలో రక్తం అయిన కన్నబిడ్డని కని పారవేసింది. అటువంటి చక్కదనాల పాపణ్ణి చేతులారా విడవడమంటే కష్టమే కాని, మరి కులమో?

ఒక రోజయినా గడువని ఆ చిన్ని బిడ్డ తల్లి చేతుల్లో మోస్తను యేసుకుంటా పూని వూరుకున్నాను. వెచ్చని ఆ పాప తలను కొమ్ము కాన్పుకోనడం తోనే పాలు చేపొచ్చినై. నాకూ ఆ బిడ్డకు యేదో తెలియని జన్మాంతర సంబంధం వుండి వుంటుం దనుకొన్నా. మళ్ళీ కొన్నాళ్ల పాటు కొంతెంత సుఖానుభవించాను.

ప్రాణం హాకత్తుగా అరచేతిలో పెట్టుకుని కుర్రవాణ్ణి పెంచుకుంటూ వచ్చాను. అతని ఆకారం అదీ చూచి యెక్కువ కులంలోని బిడ్డే అయివుంటాడని వూహించాను. మా జట్టు వాళ్లందరి మోసహా అతను చెడిపోవడానికి నా మనస్సంగీకరించలేదు. అతని మీద చిన్నతనం నుంచీ కన్నుంచి కాపాడు కొస్తూవున్నాను. నాకు నంజుడూ త్రావుడూ అంటే చెడ్డసహ్యం. తినేది మా అన్నమే అయినా అతనికి చెడ్డరుచులు మప్పలేదు. 'అమ్మా!' అని నోటినిండా పిలిచేవాడు. నా మెలమంద వొక రోజున అదృష్టవంతు డవుతాడని నాకు పిచ్చి నమ్మకం వుండి.

మా జట్టు వాళ్ళందరూ అంతవరకూ మామీద యెంతో గౌరవం చూపించేవారు. ఒకసారి భద్రాద్రి ఆ ప్రాంతాలకు పోయాం. అక్కడ మామామకా మన్య

ఎం[illegible]కో నాకు పనిచేస్తూవుంటే [illegible] [illegible]చింది. [illegible]మ[illegible]న్నా—మా యజమానులు [illegible] [illegible] చెప్పి యింటికి వచ్చి నన్ను తెలియకుండా [illegible] [illegible] పడ్డాను. నా వెనుకనే యెలమందకూడా యింటికి వచ్చి వుంటాడు. నేను కన్నువిప్పేవరకూ రాత్రి పదిగంట లవుతుంది. అప్పటివరకు యెలమంద నాకాళ్లురాస్తూనే వున్నాడు. 'అమ్మా! ఎలావుంది" అంటూ పలకరించాడు.

నాకు రోజురోజుకూ జ్వరం పెరుగుతూవచ్చింది. ఎలమంద బడికూడా మాని ముప్పొద్దూ నన్ను కనిపెట్టుకొని వుండేవాడు. ప్రతినిమిషం "అమ్మా కులాసాగావుందా?" అంటూ అడిగేవాడు. పాపం నిర్భాగ్యుడు! ఏసంపన్నుల యింట్లోనో పెరగవలసినవాడు. నా దరిద్రజీవితంలో అతుక్కొనిపోయాడు. అంతఃపురాల్లో వెలుగవలసిన మణిదీపం పాడుగుళ్లో కళతప్పి పడివుంది. ఆపసికింతయినా జన్మవృత్తాంతం తెలియదు. నన్నే కన్నతల్లిగా భావించుకుంటున్నాడింతవరకూ. నిజంగా యేతల్లి యింత సుగుణవంతుడైన కొడుకును కన్నదో ఆతల్లి చేతులారా తన ఆనంద నిక్షేపాన్ని దూరం చే[illegible] విధి!

[illegible]మీద ఆశలేదు. మృత్యువుకూడా [illegible] వుంది. రోజూ కలల్లో మా [illegible]న్న [illegible]ట్టు చెయ్యి

కనుక్కొంది. మాయెజమానిరాలుకూడా అప్పుడప్పుడు వెళ్ళి నాసంగతి చెప్పివచ్చేవారు. మా యజమానులింటి ప్రక్కనే వైక డాక్టరుగా వున్నారు. అతనిక్కి మందివ్వ వలసిందిగా రమణమ్మగారు పురమాయించేవారు. ఎల మందకు నాపథ్యపానాలకని పదిరూపాయలు కూడా యిచ్చారు. నిత్యం వుదయం. సాయంత్రం ఆవైద్యుడింటికి వెళ్ళి మందుమాకులు తెచ్చేవా డెలమంద. నాకెందు కనో తిరిగి భూమ్మీద కాలుపెడతానన్న ఆశలేదు. కాని, వొక చింతమటుకు నన్ను దహించి వేస్తూవుంది. ఇంతవరకూ నాచాటున కాలంగడుపుకున్న ఎలమంద కికపైన యేరీతిగా గడుస్తుం దన్నదే నాహృదయ కం టక మయింది. అతనిలో చాలా మంచిగుణాలున్నాయి. మోసమెరుగడు. అంత అమాయకునకు లోకం యేం సాయం చేయగలదు? భగవంతుడే వున్నాడు. దిక్కే లేకుండా చెట్టు క్రిందబడి అర్ధరాత్రివేళ చేపురించే నెల గుడ్డుకు ఆధారం చూపిన ఆభగవంతు డిప్పుడు చూపక పోడు. ఆరోజునే అతని ప్రాణం పోవలసివుంటే ఆజీవి పురిటి గదినే దాటిరాడు. అతని భవిష్యత్తులోనివి వెలుగు కిరణాలో, చీకటి మబ్బులో

నా కాలోజునుంచి [illegible] చెలికన్న మాటలేదు. ఇవ్వేళ చాలా [illegible]

నా బ్రదుకు [illegible] లో [illegible]

తప్పక చెప్పితీరాలి. అతని మెళ్లో దొరికిన వుంగరం యిప్పటివరకూ నాదగ్గర భద్రంగానేవుంది. అతడ్ని మోసగించి కాకపోయినా, అతని కెరుక పరచకుండా మాతృగౌరవాన్ని అనుభవిస్తూవున్న నేనీ అంత్యవేళలో కూడా నాతోపాటూ క రహస్యాన్ని మోసుకపోవటానికి నామనసు సమ్మతించలేదు. నే నున్నసంగతి చెప్పగానే బిడ్డ యెంత తెల్లపోతాడో! ఇంతవరకూ నామీద చూపిన గౌరవం! అబ్బా! అతనితో యీసంగతి యెలా మొదలుపెట్టాలో నాకేం తెలియడంలేదు. పది ఏడేళ్ళ నుంచి—అతడ్ని కడుపునమోసి కనలేదన్న మాటగాని, తల్లికంటే యెక్కువగా పెంచాను. అతనూ నేనంటే అల్లాగే చూసేవాడు. ఈ జబ్బువచ్చి నప్పట్నించీ అతను చేసిన సేవ యేకన్నకొడుకు చేస్తాడు? తాను చేసిన సేవంతా తన కేమీకాని వొక పరాయి మనిషి కను కుంటే అతనెంత పస్తాయిస్తాడో! ఇప్పుడు నీకూ నాకూ యేం సంబంధం లేదని చెప్పాలి. చెప్పాలంటే నోరాడు తుందా? వొకేమా రెండేళ్ళ్కాకాదు. పదియేడేళ్ళు యీ చేతుల్లో పెంచి యిప్పుడేమీ సంబంధంలేదని చెప్ప డమా? నాకు తల తిరిగి పోతూవుంది. రోజు బడినుంచి వచ్చేటప్పుడు నన్ను తీసుకుని యింటికిరావడం, ఆబళ్లో సంగతులు చెపుతూ నా కష్టసుఖాలు విచారించడం, యిదంతా కొడుకును కానని తెలిస్తే చేస్తాడా? నిజా నికి నాకు పుట్టలేదు గాని అంతమాత్రంచేత కొడుకు కాకపోతాడా? ఏమయినా నిజం చెప్పివేయాలి అనే నిశ్చయించుకున్నా.

రమణమ్మ చెప్పింది:—

అప్పుడే లేచాను. ఇంకా ముసి ముసి చీకటి పోలేదు. రోజూ ఆవేళకే పాసిపని చేయడానికని కోటి వచ్చేది. నెలరోజులనుంచీ దానికి సుస్తీగా వుండడంచేత వేరొకమనిషిని కుదుర్చుకున్నాం. "కోటికి ఎట్లా వుందో?" అనుకుంటూ వున్నాను. దొడ్డితలుపు చప్పుడయింది. తలుపుతీశాను. యెలమంద గొల్లుమంటూవచ్చి నాకాళ్ల మీదపడ్డాడు. అతని కళ్ళనుండి కన్నీళ్ళు చెక్కిళ్ళ మీదుగా వెల్లువలుకట్టి ప్రవహిస్తూ వున్నాయి. అతని కళ్లు బాగా కెంపెక్కివున్నాయి. రాత్రల్లా నిద్రలేనట్టు అతని ఆకారం చెప్పక చెపుతూవుంది. కోటి ఆనాడుదయాన్నే అనంతంలో కలిసిపోయింది.

ఎలమందను ఆరేడేళ్ళనుంచీ చూస్తూ వున్నాను. ఎందుకో అతణ్ణిచూస్తూవుంటే నాకొకవిధమైన మమత జనించేది. అతనిలో నాహృదయం కొంత నిక్షిప్తంగా నున్నట్లనిపించేది. అతని అమాయికపు కళ్ళల్లో యేదో అవ్యక్తమయిన నాఛాయ కన్పిస్తూవుండేది. అతను నా దగ్గర వున్నంతసేపూ నాలోనుంచి చీలిపోయిన వొక అంశం తిరిగి కలుసుకొన్నట్లు నిండుతనం అనుభవించే దాన్ని. అతణ్ణిచూస్తూ నాచిత్తమేదో స్మృతిసీమలో ప్రయాణం చేస్తూవుండేది.

పదియేడేళ్ళకిత్రం—అప్పుడు నాకు పది పదియే నేళ్ళు. అభాగినైన నాలో నిండుయావనం పిక్కటిల్లి వున్నరోజు లవి. నా అందం, చందం, విద్యాసంపద అన్నీ వృధాచేసి నాభర్తఅన్న అవ్యక్తి యిరవైయేళ్ళ

లోపలనే పరమపదించాడు. అతనికోసం నేను బ్రహ్మ చర్యం పాలించవలసినదిగా సంఘం శాసించింది.

నాపెళ్ళి జరగడంకూడా చాలా ధనలోభంచేతనే జరిగింది. అతనంటే మా మేనత్తకొడుకు కృష్ణమూర్తి బీదవాడవడమే నా పాపం పండింది. అతనంటే నాకూ, నేనంటే అతనికీ, చాలాప్రేమ. ధనంచూసి మాతండ్రి మనువుతప్పించాడు. మానవ ప్రయత్నంలో నా సౌభాగ్యమే వుద్దేశింపబడ్డా, పాపిష్టి దైవతం నా మంగళ సూత్రాన్ని రద్దుచేశాడు. ఆ విచారంవల్ల యేడాది తిరక్కుండా అమ్మ స్వర్గానికి వెళ్ళింది. ఇక నేనూ, మా తండ్రి, మాయిద్దరకూ వండిపెట్టడానికి మా మేనత్త కృష్ణమూర్తి తల్లి వచ్చింది. తల్లివెంట అతనుకూడా వచ్చాడు.

ఇక యింట్లో మాదే రాజ్యం. నాన్న గొడవ నాన్నదే. అత్త మా కెన్నడూ యెదురాడేదికాదు. నిండుయౌవనంలో వున్నా మిద్దరమున్నూ. మా కెదురు చెప్పేవాళ్ళు లేరు. కళ్ళాలు తెగిన గుర్రాలం.

మా చీకటి రహస్యం బయలు పెట్టడానికి చిహ్నాలు కనిపించాయి. మా పనులన్నీ తెలియనట్లు నటించినా మా అత్త కన్నీ తెలుసు. ఆవిడే మా కంత వీలు కూడా జత చేసేది. అప్పుడు మా బావ యింటరు చదువుతున్నాడు. సెలవలు ఆకరైపోగానే యేలూరు వెళ్ళిపోయాడు. నా రహస్యం అత్త జాగ్రత్తవల్ల రెండో కంటికి తెలియలేదు.

చక్కని బిడ్డ. ముక్కూ మొగం అంతా మా

బావదే. నాకు మనసొప్పక పోయినా అత్త బలవంతాన ఆ రోజుల గుడ్డుని అప్పగించక తప్పలేదు. ఆ అప్పగించే టప్పుడు నాలో నేనే యెంత కుమిలి పోయానో భగవంతుడికెరుక. ఉప్పొంగుతూ వున్న స్తన్యం, విచారం రెండూ నన్ను యమయాతన పెట్టాయి. ఏడిచాను, బ్రతిమాలాను, యెంత ప్రాధేయ పడ్డా అత్త ససేమిరా అంది. ఒప్పగించక తప్పిందికాదు. కాని, అత్తచేత మాత్రం ప్రాణాలతో యే చెట్టు క్రిందో విడిచి పెట్టేటట్టు వొట్టువేయించుకున్నాను. మరచిపోయే మా బావ వుంగరం అప్పుడు నా చేతికి వుంటే-ఏమిభావించుకొన్నానో వివరంగా జ్ఞప్తిలేదు- దాన్ని వొక దారానికి కట్టి ఆ చంటి బిడ్డ మెళ్ళో హారంలాగా ఆ దారం వేశాను. అది మాత్రం బాగా గుర్తువుంది.

తరువాత వొకేడు గడిచింది. సెలవలకు మా బావ మళ్ళీ వచ్చాడు. ఈసంవత్సరం గడువులో లోకానికీ, ముఖ్యంగా మా ఇంటికీ చాలా మార్పువచ్చింది. ఈ మధ్య కాలంలోనే నన్ను గురించీ, నా స్థితిని గురించి నాన్నగారు చాలా శోకించేవారు. తిరిగి వివాహంచేస్తేనే బాగుంటుందన్న ఆయన ప్రతిపాదన కత్త బలమిచ్చింది. విధవా వివాహాల ప్రబోధంకూడా అప్పుడే. ఇదివరకంత జనం బెదిరిపోవడంలేదు. పక్కా సనాతనులు కూడా మూకీభావం వహించారించుమించుగా. పరిస్థితులన్నీ అనుకూలంగా వున్నాయి. ఇంక పెద్ద కథేముంది? మా బావకూ నాకూ పెళ్ళయింది—

ఎలమందవచ్చి కోటి చచ్చిపోయిందని చెబుతూ

అది పోయేముందు తనకుచెప్పిన కథంతా చెప్పి బావురు మన్నాడు. అతనా కథ చెబుతూవుంటే నాజీవిత్తాన్ని యేకరువు పెడుతూ వున్నట్లుంది. నాకతనిమీద అవ్యా జంగా కలుగుతూవున్న కారుణ్యాని కరం యిప్పుడు బోధపడ్డది. కన్నతల్లి గుండెలెన్ని యేళ్ళక్రింద పోయిన బిడ్డనయినా గుర్తించుకోలేకపోవు. చేతులార త్రోసివై చిన నావంశధనాన్ని భగవంతుడు తెచ్చియిచ్చాడు. మాప్రేమలో కల్మషం లేదన్నమాట. ఎలమంద ఆవుం గరం జేబులోనించితీసి చూపాడు. అది మావుంగరమే. దానిమీద మాబావపేరు M. K. R. అని స్పష్టంగా వుంది. ఆవుంగరాన్ని కళ్ళ కద్దుకున్నా. వెక్కి వెక్కి యేడుస్తూవున్న యెలమందను దగ్గరకు తీసుకుని గుం డెకు హత్తుకున్నాను.

ప్రక్కగదిలోవుండి ఎలమంద చెప్పే కథంతా వింటూవున్న మాబావ కళ్ళు చెమ్మగిల్లుతూవుంటే వచ్చి "అంతా విధి! విధి!" అన్నాడు నాచేతిలో వుం గరం తీసుకుంటూ.

---

# కిటికీ రెక్కలు

సహస్రావుకి దేవుడూనై, గురువూనై.మాంచదువుకోని వెలగబెట్టిన రకమూకాదు. అతనికి యేంచెప్పినా కాదని వాదిస్తాడు. అంతకంటే నచ్చచెప్పే వాళ్ళే లేరు. ఎంతసేపూ మూఢవిశ్వాసాలతో కర్మవాదాలతో కాలంగడిపి చప్ప

రించేవాళ్ళని చూస్తే అతనికి వొళ్లుమంట. స్వశక్తి మీద ఆధారపడి వుండాలని అతనిభావం, ఆచరణకూడాను. థర్డుఫారం దాటిపోతే సయ్యద్ బాజీ సమాధివద్ద సవా శేరు బూంది పాతాలు యిస్తానని మీదుకట్టే విద్యా ర్థుల మోస్తరు కాకుండా కష్టపడి అయిదోఫారంవరకూ నెట్టుకొచ్చాడు. ఇక రథం సాగదని మనస్సుకు తట్టగానే అంతటితో విద్యావ్యాసంగం కట్టిపెట్టి ఏదో తన శైలివి తేటలకు సరిపడిన వుద్యోగంలో కుదిరి పదిరూపాయలు తెచ్చుకుంటున్నాడు. వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడైనట్లు తండ్రి దిగవిడిచిపోయిన సామాన్యసంపత్తికి అతని కష్టా ర్జితం జతపడి కుటుంబం నిరాఘాటంగా సాగిపోతూవుంది. యిప్పటివరకూ.

తల్లీ, తమ్ముడూ, తనూ, అయ్యమ్మా కలిసి వొక నిండుసంసారం అయ్యారు. తండ్రి తమకోసం అప్ప గించిన ఆస్తి: ఇల్లొకటి, పదిబస్తా లేడాదికి వచ్చే మడి చెక్క; ఏవో చిల్లరసామాన్లు; అయిదారువందల ఖరీదు చేసే తల్లిమెళ్లోగుల్లలు; అన్నీమించిన కుటుంబగౌరవం. దాంతోనే సలక్షణంగా నిండుకుండలా సంసారాన్ని నిర్వ హించుకొంటూ వస్తున్నాడు. అతనికి ధనంవిలువ తెలుసు. కష్టపడకుండా అదృష్టం తన్నుకు వస్తుందేమో అన్న ఆశతో డర్బీస్వీపు టిక్కట్లుకొని చివరకు పరితాపం పొందేవాడు కాడు. అదృశ్యమైన భాగ్యానికి హక్కు దారుడయ్యే నక్షత్రం తన జాతకంలోనే లేదనేవాడు. మిత్రులు బలవంతపెట్టి టిక్కట్లు కొనమంటె కొండం తాశతో వేసి పాతాళానకు కూలబడే వాళ్ళను చూస్తే

ఆతనికి జాలికంటే కోపం ముందు కలిగేది. వెరయిటీ షోస్‌లో అదృష్టం వెదుకుకొనే రకం కాదు. అతనికి అదృష్టం అంటే రోత. అందుకనే గడించటం శక్తిని చూపెట్టి గడించినట్లే కర్చుపెట్టడంకూడ రాబడిని చూచి కర్చుపెట్టేవాడు. ఎన్నిమాటలు చెప్పినా అతను పద హారణాలా నిరుకయిన మనిషి.

అతను యిరవైయేళ్ల వయస్సులో తనకోసం కని పెట్టుకొని వున్నట్లున్న వొక పిల్లను పెళ్లిచేసుకున్నాడు. తనకంటే తక్కువ సిరిగలయింటి పిల్లనేరి మరీ చేసుకు న్నాడు. తన ప్రయోజకత్వాన్ని చూచి పెద్దమనువులే వచ్చినా సుతరాం అంగీకరించలేదు. కట్నాలు లేవని అమ్మా, అయ్యామ్మా గునిసినా తనకు నచ్చినంతా చేసి తీరాడు. తన తలకు మించిన మెత్తుమెత్తి జీవితాన్ని చేదుచేసుకునే విధంగా కాకుండా తన కలిమికి వెలితి రాని త్రోవను వివాహం ముగించాడు. కొంతమంది మిత్రులు పెండ్లివిందు చేయమని పీడించక విడువలేదూ, దెప్పక మానాలేదు. సూర్రావుచేసిన పాపాన పోలేదు. ఇంకెందుకు?

అయ్యామ్మకు ఆచారం మెండు. ఆచారం అంటే అవివేకమని వ్యాఖ్యానం చేస్తాడు సూర్రావు. రాత్రి పూట క్షౌరంమాట యెత్తకూడదు. ఆదివారం క్రొత్త బట్ట కట్టకూడదు. లక్ష్మీవారం తలంటుకోరాదు. చవితి పూట గడ్డం చేసుకోకూడదు అంటూ అయ్యామ్మ మందలిస్తూవుంటే అన్నిటికన్నీ చెప్పి ఆమాటలు గడ్డి పరకకు కొరకాకుండా చేసేవా డతను. నిత్యం గడ్డం

చేసుకునేవాడు. దానికి నిత్యం అయ్యమ్మ గొణిగేది, సణిగేది. అయ్యమ్మమాట అయ్యమ్మకే అప్పచెప్పి తన పని తాను ముగించుకునేవాడు.

అయ్యమ్మ దృష్టిలో అతనొక అనాచారి మాల వెధవ. అతని దృష్టిలో అయ్యమ్మ వృత్త చాదస్తం ముండ. తాతయ్య లేడు కనుక యెట్లాగూ ముండే. సామాన్యప్రపంచం దృష్టిలో అయ్యమ్మ ధర్మదేవత, అతను కలిపురుషుడు. ఇంటికి శిఖరం అయ్యమ్మ; మూల స్తంభం అతనూ.

క్రొత్త కోడలు కాపురానకు వచ్చింది. ఆవిడతో పాటొక క్రొత్త సంగతి బయటకు వచ్చింది. అంత వరకూ యింట్లో వాడైనా సూర్రావు కాసంగతి తెలియదు. అయ్యమ్మ ఆసంగతి చెప్పేటప్పటికి ఆశ్చర్య పోయాడు. అన్నిమాటల మోస్తరే అదీ యెగర కొట్టడానికి చూచాడు. కాని అతని తెలివితేటలు అక్కరకు రాలేదు. ఎన్ని చెప్పినా సరే, ఎంతగా నచ్చ చెప్పినా సరే, అయ్యమ్మ వెరకటే మొండి పట్టు పట్టింది. ఆవిడ కమ్మకూడా తోడయింది. కాసేపు ధూం ధాం చేశాడు. వుహూ, ఎన్నిచేసినా అయ్యమ్మ పట్టిన పట్టు విడిచి పెట్టలా. తన కంఠంలో వూపిరి వుండగా ఆ పని వీలు లేదన్నది. 'ఇంత గ్రుడ్డి నమ్మకమా!' అనుకున్నాడు. ఏమనుకుంటే నేం, తన మాట సాగేటట్టు లేదు. తన ఆట గెలిచేటట్టులేదు. అయ్యమ్మ రాక్షసి పట్టు పట్టుకొంది, 'చల్లని గాలి రాకుండా స్వచ్ఛమైన వెలుగు రాకుండా ఎట్లా?' అంటా డతను. 'గాలీవద్దు, వెలుగూ

వద్దు చెప్పినమాట విందువు బాబూ!' అంటూ ఏకీభావంగా అమ్మా, అయ్యమ్మా.

ఇంత వరకూ తెలుసుకోక పోయినా యిప్పుడవశ్యం యిక్కడ ఆయింటి ఆకారాన్ని తెలుసుకోవలసిన అగత్యంవుంది. తూర్పు సింహద్వారం. ముందు పెద్ద చావిడి. తరువాత వుత్తర ముఖంగా చావిణ్ణి ఆనుకొని రెండు గదులు. ఆ గదుల ముందునుంచి మూడు గజాల వెడల్పున పొడుగ్గా దొడ్లోకి వాక సందు. గదుల ప్రక్కన వంటిల్లు. వంటింటి కెదురుగా యింకో చిన్న గది- ప్రొద్దాట భోజనా లందులోనే- దాని తరువాత పెద్ద దొడ్డీ బావీ గీవీ అన్నీ వున్నాయి. దొడ్లోవాక ప్రక్క కూరగాయల పాదులు. దొడ్లోనుంచి వంటిల్లూ గదుల వెనుక వైపునుంచీ వీధి వరకూ వాక సందు. ఇదీ ఆయింటి బొమ్మ.

చావడి ప్రక్కగది యిదివరదాకా ఖాళీగానే వుండేది. ఇప్పటివరకూ దానితలుపైనా తియ్యలేదు. పనికిరాని యిత్తడి సామాను, విరిగిపోయిన కుర్చీలు, చిరిగిపోయిన గుడ్డలు యివీ యింటివారి సామాను. గబ్బిలాయల బలగం, బొద్దింకల సిబ్బంది, సాలీళ్ళదండు క్రొత్తగావచ్చిన పరాయి ప్రాణాలు. ఇంతవరకూ ఆ యింట్లో ఆగది లేనట్టే గడుపుకొనేవారు. ఒకటి రెండు సార్లు సూర్రావు బాగుచేయించాలని చూచాడు. కాని అయ్యమ్మే 'నీపెండ్లాన్ని రానియ్యవ్రాంగ్!' అని వాక దీర్ఘం తీసేది. అతనూ 'చూద్దా' మన్నట్లుగానే వూరుకున్నాడు.

ఆగదిలో దీపం వెలిగించారు. ఒకరోజు పనిమాని గదంతా పరిశుభ్రం చేశాడు. అరణ్యాన్ని మైదానం చెయ్యాలంటే యెంత పాటుపడవలసి వుంటుందో అంత శ్రమా పడ్డాడు సూర్రావు. టాపుదులిపి, గోడలంతా బాగుచేసి, క్రిందచప్టా పూడిపించి గదిఆకారం తేల్చాడు. తరువాత గోడలకు వైట్‌వాషూ, టాపుకు వార్నీషూ, క్రింద ముగ్గులూ వేయించి నవవధూ పాదన్యాసానికి అర్హత చేకూర్చి ముస్తాబు చేశాడు.

ఇంతకూ వచ్చిన తగువెక్కడంటే, ఆగదికి వొక శేద్వారం. రెండు కిటికీలు. వొకటి చావడిలోకి, రెండవది దొడ్లోకి. గదిలోకి వెల్తురు రావాలన్నా గాలి కావాలన్నా కిటికీరెక్కలు తప్పకుండా తియ్యాలి. సూర్రావు కిటికీరెక్కలు తెరుస్తానంటాడు. అయ్యమ్మ వద్దంటూంది. నేను మానన్నంటాడు సూర్రావు. నా ప్రాణాలుండగా వొప్పుకోనంటుంది అయ్యమ్మ. ఎన్ని చెప్పినా అయ్యమ్మ వినిపించుకుంటేనా?

కాశీమజిలీ కథల్లో తంత్రీకలలో కనపడ్డ బంగారం రామచిలుకను సంపాదించడానికి బయల్దేరిన కడసారపు రాజకుమారునికి వెళ్ళగా వెళ్ళగా వొక అధ్వాన్నపు అరణ్యంలో పేదరాసి పెద్దమ్మ కనిపిస్తుంది. ఆ పెద్దమ్మకు తనువచ్చిన పనంతా చెబుతాడు. పెద్దమ్మ 'సరే నాయినా! అట్లాగే నావద్దవుండు. నాగొడ్లను మేపుతూ వుండు' అంటుంది. రాజకుమారుడు 'సరే' నంటాడు. ముసలమ్మ 'నాయనా! నీవు గొడ్లను మేపడానికి అన్ని దిక్కులకూ వెళ్ళుగాని వుత్తరానికి మాత్రం వెళ్ళవద్దు'

అంటుంది. అలావుంది అయ్యమ్మ వాక్యం. గదంతా వుప యోగించుకో వచ్చును. కాని కిటికీ రెక్కలు మటుకు తియ్యకూడదు. కథలో రాజకుమారుడు నైకరోజున ఏమివింత లున్నవో చూడాలని పెద్దమ్మ వదన్న వుత్తరపు దిక్కుకు పనిగట్టుకుని వెళ్తాడు. కొంతదూరం నెళ్ళేటప్పటికి వొక చెరువు కనిపిస్తుంది. ఆచెరువులో యేడుగురు దేవకన్యలు స్నానాలు చేస్తూ వుంటారు. అందులో కడసారపుకన్నె చూడచక్కనిది రాజకుమారుడాపిల్ల చీర యెత్తుకు వస్తాడు. ఆచిన్నది రాజకుమారుడి వెంటబడి పెరుగెత్తుకొంటూ వస్తుంది. ఆచీర యిమ్మని బ్రతిమాల్తుంది. పెళ్ళి చేసుకుంటానని ఆశ పెడుతుంది. దాంతో పెళ్ళాం అందం చూద్దామని వొక్కసారంటే వొక్కసారి రాజకుమారుడు వెనక్కు తిరిగి చూస్తాడు. అంతే, దాంతో ఆకుర్రాడొక శిలగా మారిపోతాడు.

ఆలాగే కిటికీ రెక్కలు తీస్తే యేమేనా వుపద్రవం జరుగుతుందేమో అని సూర్రావు అడగ్గా అడగ్గా అయ్యమ్మ తేల్చినకథ—

అయ్యమ్మ కొడుకు అంటే సూర్రావు తండ్రికి పెద్దజబ్బు చేసింది. ఆగదిలోనే మంచం వేశారు. అతను రేపో యెల్లుండో చనిపోతాడనగా జరిగిన సంగతి: అప్పటి వరకూ కిటికీ తీసివుండేది. అతను ఆకిటికీ వంక చూస్తూ 'అదుగో ఎవరో వస్తున్నారు. తలుపులు మూయండి' అని అరచేవాడు. యమకింకరులు ప్రాణాలు తీసుకు పోవడానికి అటునుంచి వస్తున్నారేమో అను

కునేవాళ్ళు. ఆ రెండు రోజులూ కిటికీ చూస్తూ అతను గజగజలాడి పోతూ వలవల యేడ్చేవాడు. అతను పోక ముందునుంచి కిటికీ రెక్కలు మూసి వేశారు. అప్పటికీ యిప్పటికీ ఆ రెక్కలంతే. మళ్లీ వాటిని తెరవ వలసిన పనే లేక పోయింది.

కథ విని 'ఇస్సో!' అన్నాడు వెటకారంగా సూర్రావు. ముసలమ్మ పిచ్చికూ, ప్రాణంమీది తీపికీ నవ్వుకున్నాడు. 'నవ్వూ, నువ్వేన్నన్నా చెప్పూ, వింటాను ఆ తలుపులు మాత్రం తియ్యవద్దు!' అని కచ్చితంగా చెప్పింది అయ్యమ్మ. దుడుకుపిల్ల డెక్కడ తీస్తాడో అని వేయి విధాల కనిపెట్టుకొని వుండేది. వాళ్ళ నమ్మకం తలచుకొంటే అతనికి కడుపు చెక్కలయ్యేది. ఒకో అప్పుడు కిటికీ తీస్తే యెల్లా వుంటుందో ఆలోచించేవాడు. కిటికీ రెక్కలు తెరిస్తే ముందుగా కనిపించేది సందుగోడ. దాని తరువాత పక్కింటివాళ్ళ జామచెట్టు. అటుపైన కొమ్మల సందుల్లోనుంచి కనపడే అనంతమైన నీలాకాశం.

కిటికీ రెక్కలకూ జీవితానికీ తెగిపోని సంబంధం కల్పించారమ్మా, అయ్యమ్మానూ. ఏమైనా రెక్కలు తెరవకూడదని యింటిలోవారు. రెక్కలు తీయకపోతే సుఖంలేదు. కిటికీలోనుంచి వెన్నెలరోజుల్లో చల్లగా సాగిపోయే మబ్బుతెప్పలమీద పయనించే చంద్రబింబాన్ని చూడడానికి వీల్లేదు. శరీరాలు అలసి వున్నప్పుడు చల్లని తావితో శ్రమ నపసయించే దక్షిణానిలానికి మార్గనిరోధం.పగలు,పండిన జామపళ్లు కొరుక్కు

తినే రామచిలకల సోయగం చూచే భాగ్యంలేదు. యమదూతలు వస్తే వచ్చారు. వాళ్లనన్నా బ్రతిమాల వచ్చుగాని యీచెరఅనుభవించడం కష్టం అనుకున్నాడు సూర్రావు. అయ్యమ్మ భయానికి సలాంపెట్టి వొక సుముహూర్తాన యేళ్లనుంచి చెరలోవున్న కిటికీరెక్కల్ని తెరిచాడు. చల్లని సాయంకాలపు గాలి రివ్వుమంటూ వచ్చింది. కిటికీ తెరిచిన చప్పుడు విని జామచెట్టుమీద చిలుక తుర్రుమన్నది.

అయ్యమ్మ నెత్తీ నోరు కొట్టుకుంది.

కిటికీరెక్కలు తెరిచి ఆరుమాసాలన్నర గడిచింది. అంతలో అయ్యమ్మ తాతదగ్గరకు వేంచేసింది. అప్పటి కాముసలమ్మ వయసు యనభైయేడేళ్లు. కిటికీరెక్కల కీడు ముసలమ్మమీద పోయిందనుకున్నారు, నీలాటి రేవుదగ్గర అమ్మలక్కలు:

అది నిజమే కామోసు!

---

# ఏకోదరులు

కుండెడు పాలలో చల్లచుక్కలాగా పండువంటి ఆ పెద్ద సంసారంలో వచ్చిపడ్డది చుక్కి. చుక్కి బస్తీలో పుట్టి పెరిగిన మొక్క. రాజిగాడి మనసు చుక్కిని చూచేటప్పటికి మెరమెర లాడింది. కాపుల సిఫార్సులమీద, కరణాల పలుకుబడిమీద చుక్కిని చేజిక్కించుకో గలిగాడు రాజిగాడు. చుక్కి క్రొత్తగా కాపురానికి వచ్చి

నెలరోజులైనా సరిగా కాలేదు. కట్టె కోకతీరులో, తొడిగిన జంపర్ సోరులో, బస్తీనాజూకు చూపింది పల్లెపడుచులకు. ముఖాన పులిమిన మెరుగుకూ, బర్మా ముడిలో పెట్టిన యినుప తీగెలకూ, తలకొక పెడగా దిద్దిన కొమ్ముబ్రోచికీ రాజిగాడు పూర్తిగా చిత్తయి పోయాడు.

రాజిగాడన్న కొండడు. కొండడంటే పెద్దరైతు లకు మంచి అభిమానం. అనవసరంగా వొకరి జోలికీ శొంటికీ పోయేవాడుకాడు. కరణం రామయ్యగారి పొలాలు కవులుకు తీసుకున్నాడు. పిల్లా జెల్లా అంతా కష్టపడి సాలుపొడుగునా నౌకరీచేస్తే భూదేవితల్లి కరు ణించి మిగిల్చే యేరెండుపుట్ల గింజలతోనో సంసారం నిర్విచారంగా సాగిపోతూవుంది. అన్నిటికంటే కొండడి దగ్గరవున్న సుగుణం ఆదాయాన్ని మించి వ్యయం చేయకపోవడమే. అతనికి శెంటుపొలం లేకపోయినా దమ్మిడీ ఋణంలేదు. ఆదంపతులు కష్టపడి గడించి కూడబెట్టిన సంపత్తు యిద్దరు మగబిడ్డలు, ముగ్గురు ఆడ పిల్లలు. అదేవారి నిత్యైశ్వర్యకమైన సంపద.

రాజిగాడన్నగీచిన గీటు దాటడు. తండ్రిముఖమే చూడనోచుకోని రాజిగాడికి అన్నే తండ్రి అయ్యాడు. చిన్నతనంనుంచి వొక్కసారైనా కొట్టడం మాటటుంచి తిట్టికూడా యెరుగడు. అతని చేతుల్తో యెత్తుకొని పెంచాడు. ఇప్పటికిన్నీ తమ్ముడంటే ప్రాణం విడుస్తాడు కొండడు. అటు చూచినా కొండడి కున్న ప్రేమకు రాజి గాడి భయభక్తులేమాత్రమూ తీసిపోవు. అన్నా, వదినా

అంటే అతని కంత గౌరవం. చేయమంటం తడవుగా యెంత పనైనా చేసి తీరవలసిందే. వదినైనా కన్నతల్లి కంటే కూడా యెక్కువగా దయతో చూచే దతనంటే.

రాజిగాడు చిన్నప్పటినుంచీ వాడలు దాచుకోవడం నేర్చుకోలేదు. అన్న తరిబీయత్ క్రింద గట్టి పడ్డాడు. నూనూగు మీసాలతో పాటు చుక్కి కూడా యింటికి వచ్చింది. అప్పటి వరకు అన్నదమ్ముల కష్టం రెండు వందలు చుక్కి మెళ్లో పట్టెడా నాను రూపంగా మిలమిల మెరిసినై. తమ్ముడి కోరిక కుదిరించాలని వివాహానికి కొండకు పడ్డ శ్రమ రాజిగాడి భక్తిని యిబ్బడి చేసింది. రెండు కుటుంబాలూ పొరపుచ్చలేకుండా సుఖానున్నవి.

చుక్కికి ఆ నిండింట్లో సరిపడలేదు. తన షోకులకూ కోకులకూ సాగివచ్చే యిల్లు కాదు. ఆ కొంపలో నాజూకుతనానికీ సోమరితనానికి చోటులేదు. మూడు ప్రొద్దులా చెమటోడ్చి పని చెయ్యాలి. టీకకు కాలం ప్రత్యేకింపబడలేదు. కరణం గారికి నిత్యం ఏదో చెంగలి గడ్డి చెక్కుకొని వొక మోపు వెయ్యాలి. నిత్యం పొలంలోకి మిట్ట మధ్యాహ్నం తూము గంపలో కూడు పెట్టుకొని వెళ్లాలి. చిరు చీకట్లో లేవాలి. ఊరంతా మాటు మణిగినాక పడుకోవాలి. ఈ పనుల్తో ఆ పిల్ల గుండె బేజారయింది. తన మెరుగు పవ్వడక్కూ తన బర్మాముడి ఫేషన్‌కూ తన కాలి పాంజేబు పట్టీలకు అనువైన కొంపకాదు. తన కన్నిటికీ వీలైన రాజ్యం వేరే వొకటి స్థాపించాలి. దానికి రాణీ తాను.

౨

ఆయేడు కాలం చాలా సజావుగావుంది. కోణా మణికి మంచి రాలుబడీ రాలింది. ఎకరం ముప్పందుంలు కూడా అయితే కావచ్చు. పది తూము లెక్కవగానే మిగలవచ్చని అన్నదమ్ము లంచనా వేసుకొన్నారు. పెళ్ళికి చేసిన చిల్లర చిల్లర అప్పులన్నీ దేవుడు మేలు చేస్తే యీ సాల్తో చుస్తా కావచ్చునని ఆరెండు హృదయాలూ కూడా బలుక్కొన్నవి.

ఒకనాడైనప్పటికీ చిరున చీడి యెరుగని కొండడికి జబ్బుచేసింది. రాజిగాడు అన్నగారి విషయంలో తగనిశ్రద్ధ చూపించేవాడు. రోజూ చీకటి మొగాన బయలుదేరి అక్కడకు కోసెడు దూరానవున్న వైద్యుని యింటికి వెళ్ళి ముందుగా మందు తెచ్చేవాడు. ఇంత వరకూ పనుల్లో భాగంపంచుకొనే సవతి భర్తసుస్తీ వలన ఆపనులు చూడడంవల్ల పనంతా చుక్కమీదకు విరుచుకొని పడ్డది. భర్త అన్నకు చేసేసేవ చూస్తూ వుంటే కళ్ళల్లో నలుసులుపడ్డ చుక్కకి యీభారం మరీ భారమైంది. పిల్లల అదృష్టాన భార్యపుస్తి బలాన్న కొండడు కొంచెంకొంచెం తేరుకొంటున్నాడు. కొండడు తేరుకొంటూవున్న కొద్దీ చుక్క హృదయంలో యేదో వొక ఆవేదన పేరుకొంటూవుంది. స్వార్థ పంకిలమైన చుక్కభావ రాక్షసి ఆకుటుంబ సుఖాన్ని మింగివేయడానికి నోరు విచ్చుకొని కూర్చుంది.

నూర్చి కుప్పవేశారు. యజమాని వచ్చి ముద్ర వేసుకొని వెళ్ళాడు. ధాన్యం రేపు పడతారు. ఆరోజున

కుప్ప కాపలాకి వెళ్ళవలసినభారం రాజిగాడిమీద పడ్డది. కొండడి కింకా సరిగ్గా జవ కలగక పోవడంచేతనూ మంచులో పడుకొంటే జబ్బుతిరగ పెడుతుందనీ 'వస్తా' నన్నా అన్నను యింటివద్దే నిలిపి చేతికర్రతో సపత్నీకంగా బయల్దేరాడు రాజిగాడు.

చుట్టూ అంధకారం. ఆకాశం యెంత నైల్యంగా వుందో భూమికూడా అంత మిట్టపల్లాలు విడదీయలేని చీకటి ముద్దలాగావుంది. చుక్కలు తమ శక్తివంచన లేకుండా మిణుకుమిణుకు మంటూనే వున్నాయి, రాక్షస హృదయంలోని అణిగిపోనున్న సద్గుణాలులాగా. పిశాచ హృదయంవలె అగాధమైన ఆ అంధకారాన్ని చీల్చుకొంటూ నక్కలకూతలు వినిపిస్తున్నాయి. మొగానికి మొగం కనపడని చీకట్లో పారవేసుకొన్న దేదో వెదుకుకొంటూ వున్నట్టు చల్లనిగాలి అటూ యిటూ తిరుగుతూ వుంది.

రాజిగాడూ, చుక్కీ కుప్పకాపలా కున్నారు. వెచ్చని గడ్డిపరచుకొని ప్రక్క సిద్ధంచేసుకున్నారు. ఆ అంధకారంలో ఆయేకాంతంలో చుక్కీ దురాలోచన విజృంభించింది. తనహృదయం విప్పి భర్తముందు పెట్టడానికి అదే తగిన అదను. ఆపాపభాండాన్ని యే విధంగా పగులగొట్టాలో అలోచించుకుంటూ వుంది. రాజిగాడు చుట్టముట్టించడానికి చిన్నమంట చేశాడు. ఆ వెలుగులో చుక్కీ రెండుకళ్ళూ విషాన్ని కక్కుకుంటూ వున్న ఆడపాము కళ్ళులా భీభత్సంగా వున్నాయి.

చుక్కీ చెపుతూవున్న మాటలకు గజగజలాడిపో

యాడు రాజిగాడు. తనేమొగము పెట్టుకొని అన్నతో పంచుకుంటాడు? కారణ మేమంటే యేం చెప్పాలి? ఇంతవరకూ నిశ్చింతగా జీవిస్తూవున్న తనకేంలోటని పెళ్లాంమాటవిని వేరుపడడం? పనియెక్కువనా? సంసారి అయాక పనిచేయక తప్పుతుందా! ప్రస్తుతం కాపుల్లో అన్నగారికివున్న పరపతీ, తనంటే అన్నా వదినా చేసే మన్నింపూ అన్నీ ఆలోచించుకొంటూన్నాడు. పుట్టిన పుటినుంచీ అతిగారాబంగా పెంచి పెద్దచేసిన అన్న మీదికి కత్తెత్తలేకపోయిందతని చెయ్యి. మోజుపడి తెచ్చుకొన్న పెళ్ళాంమాట త్రోసివేయడాని కతని మనసిచ్చగించలేదు. తనబుద్ధికి తోచిన కష్టనష్టాన్ని వివరించాడు. అంతకంటే యెక్కువగా వాదించింది చుక్కి. కళ్లనీళ్లు కూడా కార్చింది. ఆ నీళ్ళల్లో అతనిహృదయం మెత్త పడింది. ఆదెబ్బతో యేమూలనో మిణుకు మిణుకు మంటూవున్న ధర్మచింత చప్పగా చల్లారిపోయింది.

## 3

రోజూ సమయా సమయాల్లేకుండా తోడికోడళ్ళల్లో పోట్లాటలు చెలరేగాయి. పనికివంతు, పాటుకు వంతు, నిల్చుంటే వంతు, కూర్చుంటే వంతు. వంతుల్లో సంసారం వాడకెక్కింది. ఇదివరకు స్వర్గానికి పోటీచేసే ఆ సంసారం యిప్పుడు నరకంకంటే వేరొక పెద్దనరకంగా మారిపోయింది. పగలు పొలంలో పని చేసి చేసి వచ్చి యిల్లు చేరుకోగానే విశ్రాంతిపొందే ఆరోజులు గతించి పోయినై. అన్నదమ్ములోపిక పట్టినా కొన్ని రోజుల్లోనే యీ యమయాతన సహించ లేక పోయారు. ఇద్దరూ

కూడా బలుక్కున్నారు. మరుచటి రోజునుంచి కాపురాలు వేరన్నారు.

రాజిగాడి వంతుకు రెండు దుక్కిఎద్దులు, ఒక ముసలిగేదె, పుట్టెడు ధాన్యం వచ్చినై చెప్పుకోదగ్గవి. ఆయింటి ప్రక్కనే ఒకచిన్నగుడిసె వేసుకుని ఆయింట్లో క్రొత్తదీపం వెలిగించారు. ఇదివరకున్నచోటు నైడు దొడ్డుకుల్లేనిది. ఇప్పటిది ఆడరాజ్యం. చుక్కికి కావలసినంత విశ్రాంతి. ఇప్పుడు పనే చెయ్యనక్కరలేదు. తన చెప్పుచేతలకు 'ఊ' అనే వారేకాని 'ఁ!' అనే వారెవరూ లేరిక. తనరాజ్యాంలో రాణీతాను. భర్త ఆజ్ఞాకారి సచివుడు చుక్కి పనిప్పుడు వేస్తే వెయ్యి పుటాలుగా వుంది. మళ్ళీ వొక్కసారి పెట్టిలో దాగున్న పిన్నులూ బ్రోచెస్సూ పౌడర్లూ అన్నీ పైకి వచ్చాయి. రోజుకొక మోజుగా వేషం బనాయించేది. ఆముస్తాబుకు పల్లెటూరి గాలిలో పెరిగిన రాజిగాడు తాళుకోలేక పోయేవాడు.

రాజిగాడొక కాపు భూమిని కౌలుకు తీసుకున్నాడు. ఇదివరకుకంటే రెక్కలు ముక్కలయ్యేటట్లు పనిచేసేవాడు. అదివేరుపడిన వేళావిశేషమో, అతని అదృష్టమోగాని అక్కుళ్లు పాలుపోసుకొనే సమయానికి తెగుళ్లు తగలటంచేత బొత్తిగా అన్యాయం అయిపోయినవి. పుచ్చుకొన్న పొలానికి తగినట్టుగానే సీరి మెడ్డికూడా వచ్చింది. మిగుల్తుందనుకొన్న ఆరోట పంట వ్యవసాయఖర్చులకే మిగల్లేదు. మొదట్లోనే హంసపాదు. ఒకేసారి కాకేసు తల్లిపిల్లాతో బాకీ పెరిగింది గాని వేకే యేంలేదు. బాకీ అసలుఫాయదాలకు

నోటు వ్రాయించుకొని మామూలు రైతు పొలం కాస్తా యివ్వను పొమ్మన్నాడు. చాలామందిని అడిగాడు కాని పెట్టుబడి పెట్టేవాళ్లు, పొలం యిచ్చేవాళ్ళూ యెవరూ కనిపించలేదు. గతిలేక అంతకంటే మతిలేక మామూలు రైతు క్రింద భత్యాలకు పాలేరు తనానికి కుదరవలసి వచ్చింది. భార్యతో యీసంగతంతా చెప్పాడు. తనకు పొలం యివ్వవద్దని తన అన్నగారే అందరితో చెప్పినట్టు భార్యా పురెక్కించింది. అతని కప్పుడు తన కష్టు వచ్చేది అన్నగారే అని నమ్మాడు. పూర్వపు భక్తి విశ్వాసాలు బూడిది కాగా క్రోధంలో తన కన్నింటికే అడ్డు వచ్చే అన్నగారిని యేంచేసినా పాపం లేదను కొన్నాడు. అతని అవస్థ కూడా చాలా దారుణంగానే వుంది. పుట్టినప్పటినుంచి ముప్పొద్దు పెరుగుతో పెరిగిన ఆ జీవి పెరుగూ చల్లా లేకుండా గంజినీళ్లకే మొగం వాచి పోతున్నాడు. దుర్భరమైన ఆ దారిద్ర్యావస్థలో వున్న వివేకం కాస్తంతా మన్ను కొట్టుక పోయింది. ఇది వరకు కళ్ళకు తళతళ లాడే చుక్కి చెక్కులు యిప్పుడు బల్లాల్లాగా గుచ్చుకుంటున్నాయి. పూర్వం వున్న ప్రేమా అభిమానం అంతా మాయమయింది. ఒకో సారి వొళ్లు తెలియని కోపంలో చుక్కిని గొడ్డును బాదినట్లు బాదేవాడు కూడా. యీ పరిస్థితులకల్లా మూలం చుక్కే అన్న సంగతి అప్పుడప్పుడు తలంపుకు వచ్చినా తనకు లేని సుఖం, కలిమీ అన్నగారనుభవిస్తున్నాడే అన్న కడుపుమంట దాన్ని రానిచ్చేదికాదు. చుక్కి కూడా యే విశ్రాంతి కోసం నిండు కుండను రెండు

చేసిందో ఆవిశ్రాంతి యిక్కడా దొరకడం లేదు. పూర్వం కంటే కూడా బాడచాకిరీ చేయవలసి వచ్చింది. రెక్కాడితే గాని డొక్కాడదు.

నానాటికి రాజిగాడిపని యింకా హైన్యంగావుంది. రైతిచ్చే భత్యాం రెండు పొట్టలకే సరిపడలేక పోయింది. అతనికి పరువా లేదు. పరపతి అంతకు మునుపే చచ్చింది. బ్రదుకు సాగడంలేదు. పూటిగోతుల్లోని వొంటెద్దుబండి లాగా మాట్లాడితే ఆగిపోతూవుంది. అన్నను వొకటి రెండుసార్లు రెండు మూడు తూములు ధాన్యం చేబదులివ్వమని అడిగాడు. కాని ఆ పిల్లలుగల సంసారి అతని కోర్కె సంపూర్ణంగా దీర్చలేక పోయాడు. అదీ అతనికి గల అన్నమీది కోపాన్ని వొకసారి రేపింది.

రెండు మూడు రోజులనుంచీ యింట్లో గిద్దెడు గింజలు లేవు. రైతింటికి వెళ్ళి వొక్క తూముడు గింజలు కొలిపించమని ప్రాధేయపడ్డాడు. ఏపని మీదనో అంతలో అక్కడకు వచ్చిన రైతు భార్యా సందెడు పుల్లలు దొడ్లోనుంచి తెమ్మని పురమాయించింది. పుల్లలు తెచ్చి పడవేసేలోగా యేదో పనిమీద కొండడు అక్కడకు వచ్చి రైతుతో మాట్లాడి వెళ్ళిపోతూవున్నాడు. రాజిగాడికి ధాన్యం యివ్వనని ఖచ్చితంగా చెప్పాడు రైతు. కూడులేక చచ్చిపోతామన్నా వూరుకున్నాడు. కాని పట్టుమని పదిమానికలు కొలిపించలేదు. ఇది అంతా తన అన్నపన్నాగమే అనుకున్నాడు. అతనికి శక్తేవుంటే అన్నను నిల్చున్నపాళాన కొరతవేయించే వాడు. దరిద్రుడు! ఏంచేస్తాడు?

అతను చెప్పిన మాటలకు భార్యా వెంగతోని సించి. కడుపులోకి గంజిలేక తనూ భార్యా చస్తుంటే, కడుపులో చల్ల కదలకుండా అన్నకుటుంబం పడుకొంది కన్నెసుగకుండా. ఆకాశ చీకట్లో అయింటినేపు చూస్తూ వుంటే అతని గుండెల్లోకి మంట ప్రజ్వరిల్లింది. ఒళ్లంతా తేళ్లు ప్రాకినట్లయింది. అతనిలో వున్న రాక్షసత్వం వేయి పడగలతో తాండవమాడుతూ వుంది. సముద్రంలో అలల్లాగా దుష్టభావనలు ఒకటి తరువాత ఒకటి ముందుకు త్రోసుకు వస్తూవున్నై. ఆ భావ పరంపరలతో అతని తల బద్దలైపోతూవుంది. హానీ చేసేయుంచు మనుష్యుడు వళ్ళంతా గజగజ లాడేటట్లు అతని ప్రతి నెంట్రుకకూడా స్పందిస్తూవుంది. అతనొక అగ్నిపర్వతం లాగా సెగలు పొగలు క్రక్కుతున్నాడు.

*   *   *   *

పిల్లా జెల్లా గొల్లుమంటూ వీధిలోకి వచ్చారు. మాలపల్లె అంతా లేచింది. కొండయ్యిల్లు భగ భగా మండిపోతూవుంది. కొండయ్య వంటినూకీ సామాను చేసుకున్నలో వళ్ళంతా కాలి కమిలిపోయింది. అగ్నిదేవుడు ఆకలితోవున్నట్లు రాజిగాకీ యిల్లుకూడా ఆరగిస్తూ వున్నాడు. ఇక్కడ కొండడి ప్రాణాలు అనుమానంలో పడ్డాయి. అందరిలో తమ్ముణ్ణి పిల్చి "తమ్ముడూ! పిల్లలు" అన్నాడు. రాజిగాడు "నేనే పాపాత్ముణ్ణి—" అంటూ వుంటే "చాలును. తెలుసు. ఇద్దరం అన్నదమ్ములం" అంటూ కన్నుమూశాడు. అప్పటికే సగంపల్లిని జీర్ణం చేసుకొన్నాడు అగ్నిహోత్రుడు.

శ్రీ ... గ్రంథాలయము
తేలప్రోలు.

# పరీక్ష

విరించి చూపులో మొలిచిన మొదటి (అదే తుదికూడా అనవచ్చు) వక్రతకు మూలకారణం ధుని ముఖ పద్మం. దాని సౌందర్యానికి యెన్నో మిళిందాలు తత్తరించాయి. కాని, ఆపద్మపత్రాలింతవరకూ యెవరికీ విరిసి త్రోవచూపలేదు. నిగూఢంగా వున్న లోపలి మధురసాన్ని కొలిచి చూచిన ఆ విశాల నేత్రాలలో క్రిక్కిరిసిన కాంతి పుంజంలో ఆ నల్లని ముఖం సానలు తీరిన యింద్రనీలం. నిర్మలమైన హృదయంలోని ఔన్నత్యాన్ని సూచించే ఆ చక్కదనాలు యే పురాకృత పుణ్యమూర్తుల తపస్సులకో ఫలస్వరూపాలు.

నాలుగు చూపులు యేకాకృతి వహించిన ఆ గడియలు అప్పటి చరమాకాశంలోని సాంధ్యరాగాల వలెనే చిరస్మరణీయాలు. అవి వెంటనే విస్మృతి తరంగాల్లో కొట్టుకొని పోయినా తలచుకొన్నంతనే జీవితాన్ని మధురం చేయగల శక్తి వాటిలో నిత్యంగా వుంటుంది. విరించి మనసు ధునికి చోటిచ్చినప్పుడు అతని అస్త్ర నిస్సంశయాన్ని వెలిబుచ్చింది. అతని అనురాగానికి ప్రోత్సాహం చేసిన దామె చక్కదనమూ కాదు, వయసూ కాదు, హృదయంలోనికి చొరచుకొని పోయే ఆ సున్నితమైన చూపులైతే కావచ్చును. నిత్యం పిపాసా భరితాలైన కన్నులతో ఆమె నేత్రజ్యోతిని యెంత త్రాగినప్పటికీ అతనికి తృప్తి పుట్టలేదు. ఒకొక్కసారి ఆ రెండు కళ్ళూ మాత్రం స్వాధీనం చేసుకొంటే చాలన్నంత ఆత్రం పొందుతాడు. ఆ కళ్ళలో అతనికి ప్రకృతే ప్రతి

ఓంబిస్తుందో, కవిత్వమే ధ్వనిస్తుందో, సంగీతమే మ్రోగు తుందో అతనికే తెలియాలి.

ప్రతి సాయంత్రం చిన్న స్కెచ్ బుక్కు, పెన్సిలు, రబ్బరు పుచ్చుకుని ఆ చిన్ని వంతెన తూముమీద కొలువు తీర్చడం మానరాని అలవాటయింది. ఆ పరి సర ప్రదేశం 'ప్రశాంతం' అనలేముకాని 'సుందరం' అం టాని కభ్యంతరంలేదు. ఎదురుగా, యెండిపోయి చిన్ని సెల వలె వొక ప్రక్క సాగిపోతూవున్న పెద్ద యేరు. ఏటికవతల కొండలు. కొండలమీద వ్రాలిన మబ్బులు. మబ్బులోని సంజరంగులూ. ఆరంగుల్లో క్రొత్త సోయగాన్ని చూపించే మామిడి తోటలు లోని కొబ్బరి చెట్లు. చెట్లమీద వ్రాలు పక్షులూ అన్నీ అదొక చిత్రంగా వుంటాయి. అక్కడి సమస్తమూ అతనికి పరి చయకోటి లోనిదే. అతని చేతిలో వొదిగివున్న ఆచిన్ని పుస్తకం కడుపులో ఆ చోటంతా తన సౌందర్యాన్ని నిక్షిప్తం చేసుకుంది. సాక్ష్యం కావాలంటే ఆ పెన్సిలే చెబుతుంది.

ధుని సామాన్యమైన పిల్ల. ఆమె దేహసౌకుమా ర్యం కంటే అంగ సౌష్టవం ద్రష్టవ్యం. హృష్టపుష్టమైన ఆశరీరంలో మాంద్యానికీ నిస్తేజానికీ చోటే లేదు. రోజూ సాయంకాలంపూట రోడ్డువారనే వున్న తోట లోనికి రావటం ఆపిల్లకు అలవాటు. ఆనాడు విరిసి వలపులు వొలకబోసుకొనే పువ్వులతో పైటచెంగు నింపుకొని విరించి మనసులో క్రొత్త క్రొత్త చిత్రాలు అచ్చు గ్రుద్దుతూ యింకా సంజరంగులు మబ్బుల్లో

నిద్రింపక పూర్వమే తిరిగి యింటికి వెళ్లిపోవడంకూడా అలవాటే. ఆ కన్నెపడుచుకు తెలియకుండా యెన్నో బొమ్మలు గీశాడు విరించి. ఆ పిల్లకు నిత్యం వచ్చే ఆ ప్రదేశంలోని చెట్లూ పుట్టలూ అన్నీ పరిచయం గడించుకొన్నా అనుక్షణంలోనే యెట్లా మరుగుతున్నాయో జ్ఞప్తికి, అట్లాగే విరించికూడా. నిత్యం ఆ రాతిమీదే ఆ సమయానికే అ గీతలు గీసుకొనే స్త్రీలోనే, చూస్తూవుండడంవల్ల వొకరోజుకంటే వొకరోజు. అత నామె దృష్టికి మరీ ప్రాతగిల్లిపోయాడు. అంతమాత్రాన అతడా చిన్ని పుస్తకంలోగీసే గీతలు చూడాలన్న వుబలాటం లేకపోలేదు. కాని, ధైర్యం చాలలేదు.

ఏడుకొండలికి ప్రపంచంలో ప్రియమైనవి రెండు: ఒకటి—ధుని రెండు—ధుని పుట్టుకలకు పూర్వం నుంచి వాత్సల్యంతో పెంచి పెద్దదాన్నిచేసిన లంబుమామిడితోట. అతని దగజీవితానికి శాంతి స్థానాలూ ఆ రెండే సువర్చల అంటే ధుని తల్లి తన నిండు వయస్సులో తనకు ప్రతి నిధిగా ధునిని ఆ కళ్లు విప్పని ధునిని దిగవిడిచిపెట్టి పోయింది. ఆనాడే యేడుకొండలు మధురజీవితంలో విషవాయువులు విసిరివిసిరి కొట్టాయి. అదిమొదలు కొని అతనిలోవుండే వొక అంతర్వాణి మూగదయింది. తనపని సరిగా నిర్వర్తించుకొనే యంత్రమన్నమాట అతడిప్పుడు. కళ్లకు పారలెక్కించే అంత ధనం లేకపోయినా తోడి మానవుని అవసరానికి అక్కరపడగల సిరిసంపదలున్నై.

ధునిలో తనప్రేమ నిధానాన్ని సువర్చలను

సాక్షాత్కారం చేసుకొనేవాడు. క్రొత్తలో హితచింతకులైనవారు జీవితరథాన్ని సాగించుకొంటానికి భాగస్వామిని కావాలి అని నొక్కి చెప్పారు. కాని, "నా హృదయనాళం తెగిపోయింది. ఇక అతుకు పెట్టినా లాభం లేదు! ఈ అమావాస్యకు యిక నెలపొడుపు లేదు!" అని చెప్పేవాడు. పోయిన యిల్లాలిని స్మరించుకొంటూ ఘనిని పెద్దదాన్ని చేశాడు. అతని దుఃఖం నిర్వర్తించుకోవడానికి అదొకమార్గం దైవం ప్రసాదించాడు. ఘని పెరిగినకొద్దీ తల్లిబాల్యాన్ని అద్దంలాగా ప్రదర్శించేది. అచ్చంగా అజ్యోతిర్మయములైన కళ్ళల్లో తల్లికి మూడు మూర్తులా సరిపోయింది. ఆకనుపాపలలో దివ్యత్వాన్ని పొందిన తల్లి చుక్కలచూపమౌక్తి మిలమిల లాడేటట్లు వుండేది. ఘనికోడేలుకూడా ఆ మొహం వెలుగులోబడి తన గతించిన జీవితంలోకి వెళ్ళి తేలేవాడు. అతని ప్రయాసకు ఫలితంగా తోటా కూడ యేపుగా పెరిగి యింపు నింపాయి. తోటలో వొకభాగం ఘనికి హక్కు. అది చిన్న పూలవనం. అందులో వున్న రకరకాల పూవులూ వెనయసువలెనే పరిమళించడం చూస్తే ఘనికి ఆనందం.

విరించి వొక సలక్షణమైన అన్వయంలో అంకురించాడు. అతనిలో వొకవిశిష్టమైన సాత్వికపు ఓజస్సు ద్యోతకమవుతూ వుంటుంది. కలయింటిబిడ్డ. ఎల్లప్పుడూ శరీరం ఆత్మా రెండూ పరిశుభ్రంగా వుంటాయి. పట్నాలలోని కశ్మలం విడిచిపెట్టిన బట్టలకేగాని అతని బాహ్యాంతరంగాల్ని ముట్టుకోలేదు. అది వంశానుగతంగా ప్రాప్తిం

చిన మర్యాదే అనుకుందాం! విరించి తండ్రి లక్షకు అధికారి. ఆ వంశానికి తెప్ప విరించి. తల్లిదండ్రుల వ్యాజమెరుగని ప్రేమలో రేకులు విప్పినపువ్వు విరించి. జనకుని కళాలాలస్యం, జనని సౌందర్య జిజ్ఞాస ఏకాకృతిని ఆశ్రయించుకొనివున్న నిక్షేపం విరించి. విరించి దాదుల చేతుల్లో పెరుగలేదు. పోతపాలతో పుష్టిచెందలేదు. తన మాతృదేవత వొడిలో కండలు కట్టాడు ఆచిన్ని నరుడు.

అతనిప్పటి కించుమించిరువది వుగాదుల తొలి ప్రొద్దులలో మంగళ స్నానం చేశాడు. అతని కభిమాన విద్య చిత్రలేఖనం. సారస్వతంలో తక్కువకాని పరిశ్రమ. సంగీతం అంటే చెవులు కోసుకుంటాడు. అతని సన్నని గొంతుక, ప్రత్యూషకాలాల్లో దేశాన్ని మరిపించే దక్షిణ వాయువులకంటే మెత్తగా వుంటుంది. అతని కన్నిటికంటే అంటే అన్నపానాలకంటే కూడా యిష్టమయింది చిత్రలేఖనం. పచ్చని పచ్చికబయళ్లు, యీనమోపైవున్న గాజనాల పొలాలు, వేసవికాలంలో చిక్కి సగమై కొండల అడుగంట్రి పెద్ద పెద్ద బండలను వినయంగా తప్పించుకొంటూ పోయే కొండవాగులు, హిమప్రసారంతో పరదాలు కప్పుకొని ఘోషాగావుండే చెట్లలోకి నెమ్మది నెమ్మదిగా వొత్తిగించుకొంటూ వొత్తిగించుకొంటూ అల్లరి పిల్లల్లాగా ప్రవేశించే హేమంత ప్రాతస్సులోని బాలభాస్కర కిరణాలూ, వొకటేమిటి? సౌందర్యానికి స్థానమిచ్చే వస్తువును ప్రతిదాన్నీ ప్రాణంతో తుల్యంగా పరికిస్తాడు; పరిశీలిస్తాడు. అతని

మనసు కెక్కినదృశ్యం చేతులోని పుస్తకంలోకి కూడా యెక్కించదన్నమాటే. అతడు గీచిన ప్రతిగీతా మార్ద వాన్ని వెలికిస్తుంది. అతడు దిద్ది తీర్చిన రంగులబొమ్మ లెంతమంది కళాలాలసుల హృదయాల్లోనో గౌరవాన్ని పాదుకొల్పాయి. విరించి చిత్రలేఖకుడన్నమాటకు జగత్తు వొప్పింది.

తల్లిదండ్రు లెన్నోసార్లు అతని వివాహాన్ని ఆశించారు. కాని అతని మనస్సులో ఆసంగతే మరి తలపెట్ట లేదు. అతనికి వివాహం ప్రతిమనిషీ చేసుకోవడం యెందుకో బోధపడలేదు. చేసుకోకపోతే వచ్చేనష్టం అసలర్థమేకాలేదు. తనతూలిక కంటే ప్రియమైన వస్తు విక లేదని అతని భావం. అంతేకాని జగత్తశాశ్వతమనీ కాదు, సంసారం సాగరమనీకాదు, అసలావిషయాలే ఆలోచించుకోలేదు. "పెళ్ళి అనేది మానవు డొకప్పుడు తీర్చుకోవలసినకార్యం. దానికి సమయం అంటూ వుంటుం" దని తెలిసికోలేని వ్యక్తిత్వమూకాదు. మరి స్త్రీలంటే అసహ్యించుకొని దూరంగా తొలిగే విరుద్ధ ప్రకృతీ కాదు. పోని నపుంసకు డందామా అంటే అదీకాదు. ఎందుకో తలిదండ్రులు తొందరిస్తూన్నప్పటికీ ఆ విషయంలో పలకడు, పలకడు. జీవితాన్ని మాత్రం సక్రమమైన మార్గాన కళాసేవలో నడిపించుకొంటూ వస్తున్నాడు.

ఘని విరించి కళ్ళల్లో పడ్డ మొదటి రోజుననే మనస్సు "ఈమె నాదైతే బాగుండును" అని అనుకొంది. ఒక జీవితాన్ని తన స్వాధీనంలోకి తెచ్చుకోవా

లన్న ఆకోరిక నిత్యం ఆవస్తువు కనబడడంవల్ల బలీయ మయింది. అతణ్ణి ఆమె అంటే అంత పురెక్కించినవి ఆ అతివిశాలాలూ, అత్యంత కాంతిమయాలూ అయిన నేత్రాలజంట. ఆకళ్ళల్లో అతనికి అగాధమైన అందం కన్పించేది. అవిచూచి ఆ సౌందర్య పిపాసువు తనపరం చేసుకోవాలన్న కోరిక కోరడం తప్పుకాదు. ప్రపంచపు సంగతులన్నింటిలోకీ యుక్తమయిందీ ధర్మమయిందీ యేదన్నావుంటే అదే అనవలసివస్తుంది.

విరించి కోరిక తీరడానికి అనుకున్నంత శ్రమ గాని, కాలంగాని పట్టలేదు. పురుషకారానికి దైవం చేయూత మిచ్చింది. విరంచి తండ్రి స్వయంగా వొక శుభదినాన యేడుకొండలు వద్దకు వెళ్లాడు. అతనితో లౌక్యంగా కాక స్పష్టంగా మాట్లాడాడు. మొదట విషయం వింటూనే నమ్మలేకపోయాడు ధుని తండ్రి. కొండెక్కి కూర్చుండే ధనవంతులు పెండ్లిమాటలు మునుముందుగా అందులో తమ కేవిధానా సరిరాని బీదవాళ్లతో మాట్లాడటమంటే యుగధర్మానికి మార్పు తేవడమేగా. ఏడుకొండ లింతవరకూ తన కూతురుకు పెళ్ళిచేయవలసి వుంటుందని అనుకోలేదు. ఆమాట వినేటప్పటికి అప్పుడే తనమధ్యా బిడ్డమధ్యా యెన్నో పర్వతాలు మొలుచుకొని వచ్చినంత తొట్రిల్లాడు. ఏడు కొండలు ధనికుల సంబంధం అని మోజుచూపించలేదు. కాని ఆవంశ సాంప్రదాయం అత నెరుగందికాదు. అన్నిటి కంటే అతణ్ణి లోభపెట్టింది వరుడి సౌమ్యమూర్తి. ఆ వచ్చినవేళ మంచితనాన సంబంధం స్థిరపడ్డది. "వెళ్ళొ

స్తాను బావగారూ!" అంటే "మంచి దుంటాను బావగారూ!" అని కొంతదూరంసాగి "ఇక సెల" వంటే "సెలవు" అనుకున్నా రిద్దరు వియ్యంకులూ.

ఆ మరునాడు యథా స్థానంలో, యథాసమయాన, యథాస్థితిలో యేవ్రో ఆకాశంమీద క్షణక్షణం మారే రంగులు పరికిస్తూ కూర్చున్నాడు విరించి. ఆవేళేదో వొక కొంటె ఆనందం అతని హృదయంలో మిలమిల్లాడుతూ వుబికి పోతూవుంది. పుస్తకం తెరచి ఎదురుగావున్న చెట్టుకొమ్మమీద కట్టుకొన్న గూట్లో పిల్లలకు తెచ్చిన మేతలందిస్తూవున్న పక్షిని గియ్యాలని సగం గీస్తూవుండగానే శేషించిన కాంతికాస్తా అస్తమించింది. ఆవేళ యెందుకనో ధుని రాలేదు. ఆసంగతి అతనికి తెలుసు. ఇంక యింటి మొగమై లేచాడు. ధుని సంగతి మళ్లీ జ్ఞాపకం వచ్చింది. ఎందుకో అతని కళ్లల్లో నవ్వులాలికాయి. చెక్కుల్లో సిగ్గులు తొంగి చూచాయి.

ఆ మరునాడుకూడా విరించి వచ్చాడు. ధుని మాత్రం రాలేదు. తరువాత రోజునా అంతే. దానిపై రోజునా అంతే. వొక వారం రోజులుగడిచి పోయాయి. రోజూ ఆ వెలిగిపోయే కళ్లు తనకేసి వస్తూ వున్నట్లు త్రోవ చివరవరకూ చూస్తూవుండేవాడు. ఇప్పుడు తనకు మరుగు చేసుకోవడం అచిరంలో తన అధీనం కావడానికే అన్న ముక్క అతనికి జ్ఞప్తికివచ్చి చిన్న నవ్వువుట్టింది.

౨

లోకాన్ని పరిపాలించడానికి సుందరస్వరూపిణి వసంతలక్ష్మీ, విరించి హృదయరాజ్యాన్ని ఆక్ర

మించుకోవడానికి ప్రేమస్వరూపిణి ధునీ, వొక్కసారే విజయం చేశారు. చెట్లు చిగిరించినట్లు విరించి యిది వరకు నుండీ ప్రోగుచేసుకొని వస్తూవున్న కోరికలు చిగిరించాయి. ఆ చివురు ముదిరి, ఆకయి లాలిత్యం గోలు పోకుండా వున్నప్పుడూ, తియ్యని కోర్కులు అనభవానికి రాకుండా వున్నప్పుడూ యేదేనా ఆనందమనేది వుంటే అదే కోరనలసింది. వసంతం యెంత భయంకరముగా గ్రీష్మంలో ప్రవేశిస్తున్నదో అదే విధంగా తీరని ఆకాంక్ష అనుభవానికి వచ్చి అసహ్యం కలిగించే పరిస్థితులు వొక్కొక్కప్పుడు మానవ జీవితాన్ని సంక్షోభ పెడతవి. ఆ వుద్వేగాన్ని వొకపాటి గుండెలతో యెదుర్కోవడం అంటే చాలా కష్టమనే చెప్పవచ్చు.

ధుని యిప్పుడు పూర్తిగా తనదైపోయింది. ఆ వెలుగు కళ్ళు తన కిష్టమైనరీతిగా వినియోగించుకోవచ్చు అన్న ఆనందంతో అతని హృదయం తొణికిపోతూవుంది. ధునికి అదంతా వొక స్వర్గ రాజ్యంలావుంది. అక్కడి ప్రతివస్తువూ వొక అందానికి అంగంలాగా వుండేది. తన్నెడబాయని భర్త, తండ్రి మరపించే అత్తమామలు, అనుభవానికి మీరిన సంపత్తూ, ఆమెను కొన్నాళ్ళపాటు వుక్కిరి బిక్కిరి చేసినై. భర్తవేసిన ప్రతిబొమ్మా గంటల తరబడి చూస్తూ కూర్చుండేది. ఆ బొమ్మలన్నీ ఆమె కేదో మూగభాషలో వినిపించి తెలియని ఆనందం కలిగించేవి. భర్తగీసిన ప్రతిగీతా బొమ్మయి పోతూవుంటే అసలే విశాలాలైన కళ్ళని మరీ విస్తరించి చూస్తూవుండేది తానూ వొక బొమ్మ

విధంగా. ఇదివరకు వంతెన తూము రాతిమీద కూర్చుండి అతను గీసేగీట్లు చూడాలనుకున్న వుబలాటం కంటే అవిప్పుడు చూస్తూవుంటే ఆశ్చర్యం వేసేది. అచ్చంగా అక్కడి యేరూ, ఆ యేటిగట్టున జుట్టు విరబోసి కొని వున్న జువ్విచెట్టూ, దాని క్రిందవున్న ఆ పోలేరమ్మ రాయీ అన్నీ నిజంగా చూస్తూవున్నట్లు భావించుకొనేది. అతని బొమ్మలు చూస్తూవుంటే రోజుకు రోజుకు అతనిమీద గౌరవం పెరిగి పోతూవుంది. ఆమెదృష్టిలో లోకం అంతా వొకెత్తు; భర్తఒకడే వొకెత్తూను. ఆచిన్ని గుండెలో విరించి సాక్షాత్తు బ్రహ్మదేవు డంతటివాడు.

విరించికి యిప్పుడు కావలసిన సామగ్రి అధికంగా లభించింది. అతని ప్రతి బొమ్మా యిదివరకు కంటే యెక్కువ అందాన్ని సంపాదిస్తూవుంది. చూచినవాళ్ళు యిదివరకు కంటే ప్రశంసిస్తూవున్నారు. ప్రదర్శనాలకు వెళ్ళినవి వృత్తచేతుల్తో తిరిగి రావడంలేదు. ఈ గౌరవానికి యీ ఆనందానికి మూలకారణం అయిన మంత్రశక్తిని ప్రసాదించేవి ఆతేజో నిధానాలయిన ధుని కళ్లు. ఆసంగ తతనికి తెలియంది కాదు. అతని ప్రతి చిత్రంలో ఆకళ్ళు జిలజిల మెరుస్తూవుంటాయి. ఆముఖం తళతళ వెలుగుతూవుంటుంది. నిజంగా ధుని అన్నిరూపాలతో వికసించిపోయేది.

ధుని చిత్రం వెయ్యని రోజులేదు. అనేక భంగిమల్లో ఆమెను చిత్రించేవాడు. ఒక్కొక్కప్పుడు ధుని పడుకొంటే ఆమె లేవకముందే చిత్రాన్ని తయారుచేసి వుంచేవాడు. ఎన్నో స్కెచ్ బుక్కులూ,

పెన్సిళ్లూ ఆమె చిత్రాలతో తరిగిపోయేయి. అరిగి పోయేయి. రానురానతనేబొమ్మ వేసినా అది ధుని ఆకారానికి అద్దం అయ్యేది. సాహంకారంగా, అనునయించే కృష్ణుణ్ణి త్రోసి రాజనే సత్యభామలో ధుని కనిపించేది. విరహావివశకృశాంగియై రావణుని చెర అనుభవిస్తూ వున్న జానకీదేవిలో ధుని చూపట్టేది. పవిత్రమైన శివుని భుజబంధంలో తలనంచుకొని వున్న గౌరిలో ధుని ప్రత్యక్షమయ్యేది. అతని బొమ్మలు ప్రత్యేకంగా కాకుండా యేకత్రితం చేసి చూస్తే యించుమించు అన్ని బొమ్మలూ, అందులో చుక్కల్లాంటి ఆకళ్లూ యేకీభవిస్తాయి. అతడొకొక్క రోజున తగని ఆకాంక్షతో పలుకుబడి వినియోగించి నగ్నచిత్రాలుకూడా వ్రాసేవాడు. అతని లాలసలో నీతి నియమాలు తలలు వంచుకొనేవి. చిన్న పిల్లవాడు తన చేతిలోని లక్కబొమ్మను యిష్టాన్ననుసరించి త్రిప్పుకొనే విధంగానే విరించి కూడా ధునిని వొక క్రీడా వస్తువు మోస్తరే వుపయోగించుకుంటున్నాడు. అవిధంగా జీవితాలు సాగితే చింతలేకపోయేదే.

ధుని కాపురానికి వచ్చి నిండు యేడాది గడిచింది. ఇంతవరకూ విరించి చేసే పనులూ గీసే గీతలు ఆమె అనురాగాన్ని పురికొల్పుతూనే వున్నాయి. విరించి కున్నంత కళావ్యసనం ధునికి లేకపోవటం చాలా అనర్థానికి హేతువయిందంటే అబద్ధం వుండదు. కాలం గడచినకొద్దీ యిదివరకు ప్రియతమాలైన ఆగీతలు కళ్ళల్లో సూదులులాగా గ్రుచ్చుకుంటున్నాయి. బొమ్మ

లాంటే తల పట్టు వేసుకోవలసినంత అసహ్యస్థితి దాపు రించింది. ఇప్పుడు వికారిని చూస్తేనే భయం వేస్తూ వుంది. రాను రాను అతని పనులు దుర్భరం అనిపించేవి ఘనికి. యిప్పుడు పదారు శరత్తులు దాటిన వయస్సు. యౌవనం ఆమె బలిష్టమైన దేహంలో పిక్కటిల్లివుంది. దేహంలోని ప్రతీభాగం ఏదో ఒక అనిర్వచనీయమైన అనుభవంకోసం తహతహ లాడుతూవుంది. ఆమెకళ్లు యిదివరకంటే ప్రదీప్తాలైనాయి. ఆకళ్ళల్లో యిప్పుడు కామ తృష్ణ వెల్లివిరిసింది. ఆ కన్నె తెలియని వయస్సులో అనుభవం తక్కువైన దోషానికి బాధ్యత పడవలసిన వాడు వికారిని. కాని, అతనికి తాను ఘనిని పెండ్లిచేసుకున్నది ఆబొమ్మలు గీయటానికితప్ప వేరే కాదనుభావమేమో! పరమశివునికి వచ్చే కామదేవు డతనికి జడిసి పోయాడేమో. నిష్ఫలం! జీవనం నిష్ఫలం! అతని మాంద్యమూ, తెలివితక్కువ తనమూ—చేతకాని తనమన్నా సందేహం లేదు; అది ఘనిని పాపపు ఆలోచనలు రేకెత్తిస్తూవుంది. ఘని తన కాంక్షలను అరికట్టలేకపోయింది. మనోదౌర్బల్యాన్ని అణిచి పెట్టుకోవడానికి చేసినప్రయత్నాలన్నీ ఫలశూన్యములైనాయి. ఆమె శరీరమే ఆమెకెదురు తిరుగుతూవుంది. ఆ వికసనోన్ముఖమయిన మందారవల్లికి ఏదో అల్ప తరువు అయినా సహాకారం చెయ్యాలి. లేకపోతే అది పతనం చెందడానికి సందేహముండదు. అదివినా వేరే శరణ్యం కూడా లేదు.

ఒక రోజు గతించినకొద్దీ ఘని మనస్సులోని

ద్వంద్వయుద్ధం అవిరామ మయింది. బలిసిన శరీరం తను చెప్పే చేతల నతిక్రమించిం దిదివరకే. అలిసిపోయే ముందు గర్వమనే దీపకాంతివంటి నైతిక ఉద్భాసనా పూర్తిగా చల్లారింది. ఇప్పుడామెకు కావలసింది మృగతృష్ణవంటి ఆయనుభవం. ఆ యనుభవం కోసమే ఆమె గుండెలు సుడిగాలిలోని ఆకుపల రెప రెప కొట్టుకుంటూ వున్నాయి. ఆ వాంఛాతృష్ణలో సుకుమారమైన ఘని భావంలో అసురచ్ఛాయలు ఆవరించుకున్నాయి. ఆ వికృతచ్ఛాయలో రెండు వంశాలే కాదు, యెన్ని వంశాలనైనా కళంకితాలు చేయగల కాళిమ వుంది. ఆ భీషణచ్ఛాయలలో సంఘాన్నే కాదు, లోకాన్నే తిరస్కరించే ప్రగాఢత్వం వుంది. ఆ ఛాయలలో విజ్ఞానాన్ని, వివేకాన్ని, విచక్షణనూ నమిలి మ్రింగివేసే బలం వుంది. పతివ్రతల శీలం, సాధువుల సాధుత్వం, తింటూ పొట్ట పెంచుకున్న ఆ ఛాయను జయించిన వాళ్లెవర మృత్యుంజయులే! ఆ ఛాయలలో యెన్ని ప్రాణులిదివర కనోలోకానికి త్రోవ పట్టాయో, యిప్పుడు దారి తీస్తున్న వెన్నో, యిక అదే పథాన సాగేవెన్నో గతించిన దినాన్న, జరిగే నేడు, వచ్చే రేపు లోకంలో ప్రకటిస్తాయి.

అజ్జల్ మొత్తం మనిషి 'అందవికారా' దనిపిస్తాడు. మహమ్మదీయ సామాన్యమైన మొరటుతనం అతనిలోకూడా వుంది. ఇంచు మించు యిరవై మూడేళ్లుంటాయి. స్ఫురద్రూపి. అతని దండలూ, పిక్కలూ, చిన్నప్పటినుంచీ చేసిన వ్యాయామానికి సాక్ష్యమిస్తూ

వుంటాయి. ఇంకా పెళ్ళి కాలేదు. అతనికి విశాల ప్రపంచంలో 'నా' అని చెప్పుకోదగ్గ వస్తువల్లా 'అల్లా'. తండ్రి రహీం విరించి తండ్రివద్ద గుర్రపుబండి తోలేవాడు. తల్లి చిన్నతనంలోనే పోయింది. లోటు లేకుండా మొన్నటి వరకు రహీం అబ్జల్ని అతిగారాబంగా పెంచుకొని వచ్చాడు. అబ్జల్ తండ్రిలోని మంచి గుణాలకు హక్కు సంపాదించినట్లే తండ్రి వుద్యోగాన్ని కూడా వశపరచుకొన్నాడు. రహీం అంటే ఆ యింటివారి కందరికీ కంటిలోని పాపవలె వుండేవాడు. అతని దగ్గర నీచగుణాలు లేని కారణంచేత నిరభ్యంతరంగా వారి కొలువులో తన తనువును పరసమాప్తం చేసుకోగలిగాడు. తన మరణం గురించి పసిగట్టుకొని విరించి తండ్రివద్దకు వెళ్ళి తన వలెనే తన బిడ్డనికూడా చూసి పోషించేభారం వారిదేనని చెప్పి వుప్పొంగుకొన్నాడు.

రహీం మృత్యువు తరువాత యేకాకి అయిన అబ్జల్ తన కార్యం నిర్వర్తింపమంటూ విరించి యింట్లోనే వుండిపోయాడు. అబ్జల్ తన తండ్రిని మరపించేటట్లు కొలువు సాగించాడు. అతనికి యీ చిన్నితనువు దాచుకుంటానికి తగిన రక్షణకూడా లేకపోయింది. ఇదివరకు తండ్రీ తనూవున్న గుడిసెకాస్తా వొక పెద్ద గాలివానలో తన జాడలయినా లేకుండా మాయమైపోయింది. ఆ రోజు మొదలుగా అతనికి విరించి యింట్లో వొక చిన్నగది ప్రత్యేకింపబడ్డది. అతనూ ఆ కుటుంబంలో వొకడుగా లెక్కింపబడ్డాడు. అతడా యింట్లోని ప్రతి వ్యక్తి మీదా యెంత గౌరవం చూపిస్తున్నాడో అంత ఆద

రాన్ని పొందుతూవున్నాడు. తన పనిని నిర్వర్తించు కొంటూ తన వునికే లేనట్లు సంచరిస్తాడు. అతనికి త్వరలో నిక్కా కూడా చేయించాలనుకుంటున్నాడు విరించి తండ్రి చచ్చిపోయినరహీం మాటలు జ్ఞప్తిలో వుంచుకుని.

ధుని పడుకుని ఆలోచిస్తూవుంది. విరించి యేదో చిత్రప్రదర్శనానికివెళ్లి రెండు రోజులయింది. రేపుదయం వస్తూ వున్నట్లు యివ్వేళటి వుత్తరంలో సూచించాడు. ధుని హృయదంలో యిప్పుడు విరించి చిత్రం మాసి పోయింది. దాని స్థానే యేదో లేతగా అంకితం అవుతూ వుంది. ధునికి నిద్రపట్టటంలేదు. ఆ వెన్నెలలో తన జీవి తాన్ని సింహావలోకనం చేసుకుంటూ మనసులో కుమిలి కుమిలి యేడుస్తూవుంది. నిద్రపట్టని కారణాన యింటి కానుకొనివున్న తోటలోకివెళ్ళి గుత్తులు గుత్తులుగా విరి సిన నూరువరాల పూవుల వాసనతో ఆమెకు యేదో క్రొత్త ఆవేదన పుట్టింది. నెమ్మదిగా బొగడచెట్లక్రింద నుంచి పారిజాతపు అంట్ల ప్రక్కగా వెళుతూవుంటే వాకగదిలోని దీపంకాంతి యివతలికివచ్చి వెన్నెలలో కలిసి పోతూవుంది. ఆ గది దగ్గరకు వచ్చేటప్పటికి యేదో మెరపులాగా ధుని హృదయంలో ఆలోచన మెరిసింది. వద్దు వద్దు అనుకుంటూనే పాదాలు కిటికీ దగ్గరకు తీసుకువచ్చాయి. ఇచ్ఛాశక్తి ఆకిటికీలోనుంచి తొంగిచూడమంటుంది. సతీత్వం తప్పు తప్పు ఆపని కూడదంటుంది. 'ఒక సారి చూచినంతలో వచ్చినదోషం యేముం' దంటుంది ఇచ్ఛ. 'పరాయి వాణ్ణెందుకు చూడాలి?' అంటుంది సతీత్వం 'అబ్జల్ పరాయివాడు

కాదులే!' అంటుంది యిచ్ఛాశక్తి. దానికింకేమీ మారు చెప్పలేక పోయింది సతీత్వం. చివరకు ధుని మునివేళ్ళ మీద పైకిలేచి గదిలోకి తొంగిచూచింది. లోపలి దృశ్యం—వొక ప్రక్కన చాప, దానిమీద గొంగడి. అందుపైన వొకపాతకండువా పరచినప్రక్క అబ్బల్ గుర్రు కొడుతూ నిద్రిస్తున్నాడు. మైమరిచిన ఆనిద్రలో బట్ట అజమాయిషీ యెవరిక్కావాలి? పూర్తిగా నగ్నస్వరూపం. వెలుగుకోసం పెట్టిన కంతల్లోనుంచి వెన్నెల అతని మీద పడుతూ ఆచిత్రాన్ని వుత్తేజకరంగా చేస్తూ వుంది. ఆదృశ్యం చూసేటప్పటికే ధునికి పిచ్చియెత్తింది. తల్లో గుర్రాలు పరుగెడుతున్నాయి. జ్ఞానంతోపాటు అవయవాలు పట్టు తప్పాయి. ఆవిడ ఆత్మను పొగ మబ్బులాగా ఆవరించుకున్న వొకపిశాచం ఆవెన్నెలను కూడానల్లగా కనబడేటట్లు చేసింది. కళ్ళు రాజుకుంటూ వున్న నిప్పుకణాల్లా యెరుపెక్కి వున్నాయి. మొగమంతా వికృతంగా వుంది. శరీరం అంతా జ్వరం వచ్చినట్లు మాడి పోతూ వుంది. ఏవో పిచ్చి ఆలోచన్లు తుదీ మొదట్లేనివి చీకాకు కలిగిస్తూ వున్న ఆసమయంలోని ధుని పూర్వపు ధుని కాదు. పిశాచం పట్టిన మనిషికీ ఆవిడకూ తేడా లేదంటే సరిపోతుంది.

పాదాలు చెప్పకుండా గది గుమ్మం దగ్గరకు నడిపించాయి. చేతులు తలుపులు తట్టాయి. అబ్బల్ కలత నిద్రలో కళ్ళు తెరచి నులుముకుంటూ, బట్ట సరిచేసుకుంటూ తలుపు తెరిచాడు. ఎదురుగా ధుని. అతను వెనక్కు రెండడుగులు వేశాడు. ధుని గుమ్మంమీద

కాలు గదిలో పెట్టింది. అబ్జల్ యేదో అంటున్నాడు. కాని, ఆ మాటలు చెవులకు వినిపిస్తూవున్నా అర్థం మాత్రం ఘునికి బోధపడడంలేదు. ఆవిడ చూపులు అబ్జల్ దండలమీదా, యెదురొమ్ముమీదా ప్రాకి సల్లటీలు కొడుతూ వున్నాయి. అబ్జల్ అంతదేహం గజగజ లాడి పోతూవుంది. అతనికి సరిగా గొంతు పెగిలి మాటకూడా రావడంలేదు. ఘుని మెల్లగ లోపలికి జరిగి గెడ వేసింది. అబ్జల్ అది వారించాలని అనుకుంటూనే అడుగు ముందుకు వేయలేకపోయాడు. ఘుని అతనివైపుకు జరిగింది వుడలికి వొడలు తగిలే అంతగా. అతను తప్పుకున్నాడు. అమాంతగా మీద వ్రాల్లి పడింది. అతను చేతులు చాచి ఆమెను ఆపుతూ వద్దని బ్రతిమాలాడు. ఎన్ని విధాల చెప్పినా ఆవిడ చెవికి నాటలేదు. ప్రతి నిముషం ఆవిడ వుద్రేకాన్ని ప్రజ్వలింపచేస్తూ వుంది. ఆకుటుంబం మీదవున్న విశ్వాసం పురికొల్పగా నోరు నొప్పి పుట్టే అంతవరకూ చెప్పిచూచాడు. వృథా! పొంగివచ్చే ఆప్రవాహాన్ని అడ్డుకొనే శక్తి యిక అబ్జల్‌లో లేకపోయింది. అతని యౌవనం నెమ్మది నెమ్మదిగా ఆ వెల్లువకు లోబడిపోయింది. మృణాల సుకుమారాలయిన ఘుని బాహువులు అబ్జల్ కంఠాన్ని చుట్టుకున్నాయి. ఎదురొమ్ముకు తగిలే సుఖస్పర్శలో అబ్జల్ కన్నులు ముకిళించుక పోతున్నాయి. నదిలో నది కలిసిపోయినట్లు వొకరి దేహం వొకరి దేహాన్ని మెలిపెట్టుకుంది. అల్లాడి పోతూవున్న అధరాలు వెచ్చని ముద్దులు వేయించాయి. గదిలో దీపం ఆరిపోయింది. చంద్రుడు గూడా తన వెలుగును

గదిలో నుంచి వృషసంహరించు కున్నాడు. చీకటి తప్ప—

ధుని స్వర్గసుఖాన్ని కైవసం చేసుకుంది. అక్కడ కాలం యెంతసేపు గడిచిందో కాని యింకా చీకట్లు చెరిగిపోక ముందే ధుని గది విడిచిపెట్టింది. విడువలేక విడువలేక అబ్జల్ ఒకసారి ఆమెవంక ప్రార్థనాపూర్వకంగా చూచాడు. ధుని అతని వ్రేళ్ళోవచ్చి వ్రాలింది. రాత్రి యింత త్వరగా గడిచినందుకు తిట్టుకుంటూ ధుని లేచింది. అబ్జల్ బాగడ చెట్లువరకూ సాగనంపాడు. గదిలోకి వచ్చి నలిగిపోయిన ప్రక్క సరిచేసుకుని నడుం వాల్చా డబ్జల్. మామూలుగా ఆరింటికి లేచేవాడా రోజున యెడుగంటలు చేశాడు. ఇవ్వేళ కెంపుకనో నలిగినట్టున్నావే అబ్జల్! అంది పనిమనిషి సుబ్బి.

ఉదయం గం॥ 8 ల మెయిల్‌లో విరించి వచ్చాడు. అతని ముఖం ప్రాతస్సర సిజంవలె వికసించివుంది. ఇంటికి వస్తూ నేలతన ధుని తనకెదురుగావచ్చి స్వాగత మిస్తుందని ఆబొమ్మ మనసులో చిత్రించుకొంటూ వచ్చాడు. కాని అతని సంకల్పం సత్యానికి చాలా దూరంలోవుంది. ధుని యింకా ప్రక్కే దిగలేదు. విరించి ఆమె నుదురు స్పృశిస్తూ మెల్లగా మేలుకొలిపాడు. ధుని లేచింది. చాలా బడలికగా వున్నట్లు కన్పించింది. విరించినిచూసి మొదట కొంత తడబడ్డా మరుక్షణంలో స్వస్థపడింది. "ఇప్పుడే వచ్చారా?" అని ఆదరంగా ప్రశ్నించింది. విరించి "ఔ" నంటూ ప్రదర్శనానికి వచ్చిన బొమ్మలూ, వాటివిశేషాలు, తన బొమ్మలు గడించుకున్న ప్రశంసలూ నగ్నప్రేమ" అనే బొమ్మ చెందిన ఔన్నత్యం, అది

సంపాదించిన బంగారు పతకం అన్నీ విపులంగా చెప్పి బహుమానాన్ని చూపించాడు. అవన్నీ వింటూ ధుని ఆనందాన్ని చక్కగా నటించింది.

రోజులు గడచి పోతూనే వున్నాయి. ధుని రహస్యం గుట్టు చెడకుండా వస్తూనేవుంది. అనిర్వచ నీయమైన ఆనందం దినంకంటే దినం స్వర్గలోకానికి తీసుక వెళుతూవుంది. పూర్వం మసక మసకగావున్న విరించి రూపం హృదయంలో సాఫుగా చెరిగేపోయింది. ఆ స్థానాన్ని అబ్జల్ రూపం ఆక్రమించుకుంది. ఆవిడ కళ్ళల్లోవున్న పూర్వపు వెలుగులో యిప్పటి వెలుగులో చాలా అంతరంవుంది. ఇప్పటి వెలుగులో దృశ్యా దృశ్యంగా ఒక నీలరేఖ మెలిచింది. వెనుకటిఆ నైర్మల్యం ఏలా వుంటుంది? ధుని యెంతగా నటించడానికి అల వాటుపడ్డా విరించి దగ్గర మెలగడం కష్టంగానే వుంది. అతను చూపించే చనువుకు ఆమె గుండెలు రగిలి పోతూ వున్నాయి. ఎంతసేపూ అతనికి దూరంగా తొలిగివుండాలని ప్రయత్నించేది. విరించి యథాప్రకా రమే వున్నప్పటికీ ధుని అతనికీ తనకూ మధ్య సము ద్రాలు వున్నట్లు భావించుకుంటూ వుండేది. సూర్యుణ్ణి చూడలేని గుడ్లగూబలాగా వుంది ఆమెస్థితి, గతి. చివర కాయింట్లో అతనితో కృత్రిమంగా నటించడం ఆమెకు దుర్భరమై పోయింది. అతని నీడకే, వొకసారి తననీడకే వులికిపడి పోతూవుండేది.

అబ్జల్ చెవిలో యిల్లు గట్టుకుని పోరిపోరి 'పూం' అనిపించింది. ఎంత పాపపు పని కోడబడినా అబ్జల్ కం

తటి సాహసం పుట్టలేదు. కాని, చివరికి ఆమె చెప్పిన సంగతికి లోబడతుండా తీరలేదు. మధ్య మధ్య అతనిలో కలిగే దౌర్బల్యాన్ని తొలిగించడానికి అమూల్యమైన ఆభరణాలు మంచి పని చేశాయి. ఆమె చూపట్టే స్వర్గాన్ని తిరస్కరించే అంత శక్తి యిదివరకే దొంగిలింపబడింది. కళ్ళక్కనపడే ఆ బంగారపు మామిడి పండును చూస్తూ కాదనడం యెట్లా? రత్న కిరీటాన్ని చేచేతలా త్రోసివేసే సామర్థ్యం యెందరి కుంటుందంటూ?

ఆ రోజున రాత్రి అంధకారంలో చీకటితో సమానమైన కళంకాన్ని వెంటపెట్టుకుని ధుని, అబ్జల్ స్వైరంగా లేచిపోయారు. యిల్లు దూరమైనకొద్దీ ధుని గుండెల్లోని బరువు కూడా దూరమయింది. మూడు నెలల నుంచి హృదయాన్ని పీడిస్తూవున్న విరించియొక్క ఛాయ అయినా యిప్పుడు ధునిని తాకలేదు. ఆమె భావనలు క్రొత్త కాపురంలోని విధానాలను గురించి చెలరేగుతూ వున్నాయి. అబ్జల్, తన అబ్జలు, ప్రక్క రాత్రిలో స్వర్గసౌఖ్యాన్ని తనకు రుచి చూపించి తెచ్చిపెట్టిన అబ్జలు, తనమాట కాదనలేక యావజ్జీవం తన వాడు కానున్న అబ్జలు వుండగా ఏం కొరత? తనవెంటటిన కావలసినన్ని నగలు, తనచేతిలో వేలకొలదీ ధనం, ఇక ప్రేమరాజ్యాన్ని నిరంతరంగా యేలుకోవచ్చు!

షుమారు నగలారు వేలుంటాయి. చేతిలో పైకం మూడువేలు వచ్చేటప్పు డినప్పెట్టెలోనుంచి తీసిన బాపతు. వాటితో ఒక చిన్న మేడలో క్రొత్తకాపురం

ప్రారంభమయింది. అబ్జల్ ధుని అంటే వినయ విధేయ తలు చూపించేవాడు. రానురాను ఆవిడమీద గౌరవం తొలిగి పోతూవున్నట్లే చెడుసహవాసం యెక్కువయింది. చెడు సావాసానికి జీవగర్ర స్వాతంత్ర్యం, పుష్కలమయిన ధనం. అబ్జల్ చెడిన నీతికి యివి వూతమిచ్చాయి. రెండునెలల్లో రెండువేలు ఖర్చు. ఆ అంచనాలీలిగా వాళ్ళ జీవితం సుఖమయంగా గడిచేకాలం వ్రేళ్ళమీద లెక్క పెట్టవచ్చు. ధుని ఖర్చు విషయంలో అబ్జల్‌ను హెచ్చరించింది. అతను మాట్లాడకుండా మొగం మాటు వేశాడు. మూడో నెలలో ఖర్చు యిబ్బడయింది. ధునికి యిప్పుడు నిల్వబెట్టి అడగవలసిన అవసరం వచ్చింది. ఆ సమయాన్నే నిగూఢంగావున్న అబ్జల్ ప్రకృతి బయట పడింది. ఆ రోజున అబ్జల్ వుస్సెనలాగా యెదురు తిరిగాడు. అనుకోని యీపాటుకు ధుని చాలా క్రిందుమీదు లయింది. కొన్నివారాలు గడచేటప్పటికి నగల్లో సగం తరిగిపోయినై. కాదంటే ధునికి తన్నులుకూడా అనుభ వించవలసిన గతి పట్టింది. ఆవిడ నిర్మించుకొన్న స్వర్గ వాటిక కంటక మయమైన అధ్వాన్నపరణ్యంలాగా పరిణామం చెందింది. ఆ అరణ్యంలో శరణ్యం లేదు. తన సంగతి ఆలోచించుకొంటూవుంటే కడుపు చుమ్మలు చుట్టుకుపోయేది. తన మృగతృష్ణ అస్తమించింది. యీ మబ్బులేని పిడుగు జీవితాన్ని ధ్వంసం చేసింది. తనప్రియుని సౌఖ్యంకోసం దేశాన్ని, సంఘాన్ని, కాపురాన్ని పరిత్య జించి వచ్చిన తనకు అబ్జల్ చేసిన ఘాతుకం, తాను చిం చుకి చేసినదానికి విందకేమో; అన్న సమాధానం చెప్పే

కుని విచారం వుపశమించు కోవడానికి ప్రయత్నించేది. కాని ప్రయోజనం లేకపోయింది. అబ్జల్ యింటికి రావడమే తగ్గిపోయింది. వచ్చినా పూర్తి నిషామీద వచ్చేవాడు. వచ్చినప్పు డేమాటలమీదో తన్నులు తప్పితే ఫలం లేకపోయేది. నెల తిరగక ముందే అబ్జల్ ధుని శరీరాన్ని నాశనంచేసి యిక మరి ముఖం చూపించకుండా పోయాడు. ధుని నేడొక అనాథ అయింది.

కొద్ది రోజుల్లోనే ఆమెకు లోకస్వభావం తెలిసి వచ్చింది. అంతఃపురాల్లో వుండే యెన్నేళ్లకయినా అనుభవానికి రాని విషయం అపారం పదిరోజుల్లో గ్రహించింది. కొంగుచాపితే పట్టెడు బిచ్చం పెట్టే దాతలే లేకపోయారు. తిరిగి పాదాలమీద పడి క్షమాపణ చెప్పుకుందామన్న బుద్ధి కలిగింది కాని, అభిమానం దాన్ని గెంటిపెట్టింది. పైగా, తా నేసుఖసౌఖ్యం కోసం బరితెగి వచ్చిందో ఆపాపం, అపిశాచచ్ఛాయ, తనలో యింకా ఆరిపోకుండా మొలకెత్తుతూనే వుందని గ్రహించింది. పట్టుమని యిరవైయేళ్లు లేని ప్రాయం. ఇంకా వయసు విక్రయించే పరిస్థితులు తప్పలేదు.

ఆమెసిలపలు మారిపవి. ఇదివరకు తన డబ్బు అబ్జల్ హరించాడు, యిప్పుడితరుల డబ్బు తాను లాగుతూ వుంది. తనచూపులనే గాలానికి క్రొత్తచేపలు తగులుకుంటూనే వున్నాయి — వంచుకొన్నమ్మకు వొకే కూర. అడుక్కొన్నమ్మకు కనేకాలు!—వృత్తిలో జాణయింది. ఇదే సుఖమన్న భావం మళ్లీ తలచూపింది. ఈ వృత్తి చేపట్టిన కొలది కాలంలోనే ఆమె పిపాస పూర్తిగా

హరించింది. ఒకఅలవాటు నిర్వర్తించుకోవడంగామారి, తుదకు వ్యాపారం క్రిందికి వచ్చింది. ఇతర్ల డబ్బును కోరి తాను తీసుకోంటూవుంటే ఆకోందరు యితర్లు కోరకుండానే డబ్బుతోపాటు దుస్సహమైన వ్యాసులు కూడా యిచ్చిపోయారు. ఈ పాపాల కన్నిటికీ ఫలస్వరూపంగా వొకకూనారు. అది పుట్టిన రెండోనెలలోనే మట్టికూడా అయింది. అప్పట్నించీ తగనిరోగాలతో బాధ పడుతూవుంది. మంచాన్నంటుకు పోయిన ఆశరీరాన్ని చూచేవారే లేరు. ప్రాత చుట్టాలిప్పుడు పిలిచినా మాట్లాడరు. ఆమె మనస్సు పూర్తిగా మారిపోయింది. అనుభవం వల్ల పరిపక్వంకూడా అయింది. చేసినపాపం కళ్ళముందు వ్రేలాడుతూవుంది. దానికి గుండెలు తపతపలాడి పోతూవుండేయి. ఈ పాపాలకు ప్రాయశ్చిత్తం యేవైద్దున వుందో? సంఘాన్ని త్రోసివేయకలిగినంత త్వరగా అంకులో ప్రవేశించాలంటే కుదురుతుందా? ధునికి మళ్ళీ తన విరించి మీదకు చూపుపోయింది. కళామగ్ధమైన అతనిమూర్తి మాటిమాటికీ కనిపించేది. కూర్చున్నా పరున్నా ఆమూర్తి విడిచిపెట్టకుండా వుండేది. రోజుకు రోజు కావేదన హెచ్చింది. అది శాంతిపొందడానికి వొకటే మార్గం. ఆమార్గమే తిన్ననైనమార్గం.

## 3

ధుని తన్ను విడచిపెట్టి వెళ్ళిపోయింది మొదలుగా విరించికి జీవితం అంధ తమసం అయింది. తన కళకూడా తనకిప్పుడుపకరించ లేదు. కళకోసం జీవితం గడుపవచ్చు

నసుకొన్న అతని కిప్పుడు తత్వం బోధపడ్డది. తనకళ తన కానందమియ్యలేక పోయింది. ధుని వెళ్ళిపోయిన తరువాత కాగితం మీద వ్రేక గీతగీచి యెరుగడు. మనసుకు స్థిమితం లేదు. మూసుకున్న కళ్ళప్పుడు విచ్చాయి. ధునికి తాను తెలియకుండా చేసిన ద్రోహం యిప్పుడర్థమయింది. తన నిష్కామ చర్యను చూచి అదెంత మనస్సడేనో యిప్పుడూహించుకో గలుగుతున్నాడు. ధునిని వెదికి చమనీ, అబ్దుల్ మీద కేసు పెట్టమని యెవరన్నా చెప్పినా సమ్మతించేవాడు కాదు. తల్లిదండ్రులెంత ప్రయత్నించినా అతనికి శాంతి ప్రసాదించలేకపోయారు. ధుని విషయంలో చేసిన కూడనిదాని పొరపాటేకాక కూడనిదనే అతని భావం. ఆ కళ్లను చూచి తనదాన్ని చేసుకో గలిగాడు. కాని ఆమె నూతన ప్రాణంగలిగిన వ్యక్తి అనీ, నిశ్చేతనం అయిన క్రీడా వస్తువు కాదనీ అప్పుడు గ్రహించుకో లేకపోయాడు. ఎన్నెన్ని ఆకాంక్షలతో ఆమె హృదయం వ్రక్కలివక్కలై నిలదొక్కుకోలేక చెట్టునే వాడిపోయిన పూవుల్లాగా అయినదో తెలుసుకుంటానికే అతనికి శక్తి చాలలేదు. భగవంతుడు తనకళ్ళు తెరిపించటానికే ధునిని దూరం చేశాడు, అనుకుంటూ రోజుకు రోజు పిచ్చివాడై పోతూవున్నాడు. అట్లాగే మూడేళ్లు వెళ్లాయి.

ఆనాడు పూర్ణిమ. యేదో పిచ్చి ఆలోచనల్లో అస్తమిస్తూవున్న సూర్యుణ్ణి, వుదయిస్తూవున్న చంద్రుణ్ణీ చూస్తూ తన దుఃఖం కూడా యిలా అస్తమిస్తే సుఖం అలా వుదయిస్తే యెంత బాగుంటుందో వూహిస్తూ తోటలో తిన్నెమీద కూర్చున్నాడు విరించి. అతని కాలోచన

# నిష్కృతి

౧

శ్రీ పూరి మాలపల్లెకు రాముడు అనభిషిక్తుడైన సామ్రాట్టు. అతని బుద్ధికి కోపము పాపము దూరబంధువులు. అతని మాట చుట్టుప్రక్కల పల్లెలకుకూడా ధర్మవచనము. అతనంటే చౌదరయ్యలకూ, కాపులకు విశ్వాసమూ, అభిమానమున్ను. రాము ఏమంత చదువరి కాకపోయినా సాతాని సుబ్బయ్యతో చిన్నప్పటి నుంచీ కలిపిన సావాసంవల్ల పౌరాణిక గాధలలో చాలా ఘటికుడు. పురాణం ఆచార్యులు చెప్పేదాని కంటే మా రాముడు చెప్పేదే బాగుంటుంది స్వామీ! అనేవారా మాల మాదిగలు మాట వచ్చినప్పుడు. రాముడి వయస్సుతో పాటు అనుభవంకూడా పెరిగింది. కాగి చల్లారిన పాలు.

పల్లె కష్టసుఖాలలో అతనొక భాగస్వామి అయేవాడు. ఏడ్చేవారితో ఏడ్చేవాడు. నవ్వే వారితో నవ్వేవాడు. అదిగాక వారందరికతను ఆచార్య దేవుడయ్యాడు. అతనిచూపు యెంతవరకూ యిహాన్ని దాటి వుండేది. అత డుబుసుపోని యువకులకూ కాలం తీరిన వృద్ధులకూ చిత్తశాంతి సమకూరేటట్లు తన యింటనే వొక భజన కూటం లేవనెత్తాడు. శనివారం రాత్రి ఆ పల్లెలో భక్తి మకాం చేసేది. రాముడి కంఠం కిన్నెరసాని వీణలా సొగసుగా వుండేది. అతని పాట వింటానికి ఆ రోజున కొంతమంది రైతులుకూడా

చింతలకింద కొలువు తీర్చేవారు.

రాము డావూళ్లో చాలా పరపతిగా వుండేవాడు. ఒక యకరంపైగా పల్లభూమి వుంది. రెండుకాళ్ల పసువులు. ఒక జిండెడ్లజత. ఋణఘణాదు లేమీ లేవు. బాంహ్మలవి పది పంద్రెం డెకరాలు పాలుపద్ధతిని కవులుకు తీసుకునేవాడు. తనూ, భార్యా, కూతురూ, అల్లుడూ వొక కొడుకూ. అతని కింకా పెళ్లి కాలేదు. ఈ యేడు పంటల్లో వచ్చిననఫా, యింకా యేదో కొంత అప్పు తీసి కొడుకుని వొకింటివాణ్ణి చెయ్యాలని సంకల్పించుకున్నాడు. అంతా ఆ రాముడి దయ. ఇదీ రాముడి సంసారం, స్థితిగతులున్నూ.

"ఏరా, రామా! వొక తడుపుకు నీళ్లివమంటే యివ్వనన్నావంట?" అని కరణం రాఘవయ్యగారు కొంత కటువుగా అడిగారు. "మాకే సరిగా సరిపడవండీ స్వామీ!" అన్నాడు రాముడు చేతులు దగ్గరకు చేరుస్తూ. "అయితేనరే వెళ్ళరా!" అన్నాడు కరణం. ఆ 'వెళ్లరా!' అనేమాటలో యేహాలాహాలం ప్రతిఫలిస్తూ వుందో!

2

"ఏరా, కళ్ళు నెత్తికెక్కాయా? వెధవాయ్!" అన్నాడు కరణం గుస్సురుముతూ. 'లేదండీ! ప్రభువులు మన్నించాలి' అన్నాడు సూరీడు. సూరీడు రాముడి కొడుకు. ఇరవైఅయిదే ళ్ళుంటాయి. చిన్నప్పటినుంచీ పరిశ్రమ చేయడంవల్ల కండరాలు స్ఫుటంగావున్నాయి. [illegible]కారం హృష్టపుష్టంగా వుంది. నిగనిగలాడే ఆనలుపు [illegible]గాడా అందం అనిపిస్తుంది. మనిషి కొంచెం కోపిష్టిగా

వుంటాడు. చూపుమట్టుకు చాలా నిశితంగా వుంటుంది. ఇంచుమించు చతణ్ణిచూస్తే వొక గ్రీకు చిత్రానికి ప్రతికృతి లాగా వుంటాడు. మాటలోకూడా కొంచెం తొందర.

ఆ నాటి వెనక సాయంత్రమే సూరీడు పొలం చూచిరావడానికి వెళ్లాడు. పొలం దారిప్రక్కనే వుంది. కిచిడీధాన్యం యీన మోపైవుంది. ఎకరానికి పుట్టి పందుం రాలుబడి అవుతుందని అంచనా వేసుకొంటూ గట్టుమీద నడుస్తున్నాడు. ఆ చల్లని సంజవేళ అతని వివాహం మాటకూడా తలపుకువచ్చింది. గాలిలో మేడలు కడుతూవున్నాడు సూరీడు. అంతలో తూరుపేపు మూలన యేదో తెల్లగా కనపడ్డది. అదేమిటో చూడాలని పరుగెత్తుకొంటూ వెళ్ళాడు.

కరణంగారి పాడిగొడ్లు రెండు మూడూ, గిత్తలూ, యింకా గేదెలూ చేలోపడి పైరు నాశనం చేస్తున్నవి. సూరీడు చుట్టూచూచాడు. గమళ్ళవాళ్ళ పొలం గట్టుమీద కూర్చుండి అదలించకుండా చూస్తున్నాడు వొక గొడ్లకాపరి. పదునాలుగేళ్లుంటాయి. ఆగొడ్లను నాలుగు బాది చేలోనుంచి మళ్ళించాడు. ఒక గిత్తమాడ యెంతకూ కదలడంలా. సన్నగా చేతులోవున్న కర్రతో గట్టిగానే బాది మళ్ళించాడు. దద్దుర్లు కట్టినమాట మాత్రం నిజమే. ఇంతవరకూ గట్టుమీద చూస్తూ నిలుచున్న ఆ పాలేరు కుర్రాడు పశువుల్ని కొట్టినందుకు రణభేరీ మ్రోయించాడు. సూరీడు మొట్టమొదట సామంగానే చెప్పాడు. పిట్ట కొద్దీ, కూత ఘనం అయినాయి ఆ కుర్రాడు పారం వల్లించుటకు వచ్చినట్లు మాట్లాడా

సూరీడుకు కొంచెం కళ్ళెఱ్ఱబడ్డాయి. తన యింట దొంగ తనం తనమీద ఫిర్యాదున్నూ 'గొడ్లను చేలోకి తోలింది కాక యింకా గింజుకుంటావేరా గాడిదా?' అన్నాడు సూరీడు. శబ్దశాస్త్రం నిర్వచింపలేని తిట్లు అపురూపంగా ప్రయోగించాడా కుఱ్ఱకుంక. సూరీడు కోపం పట్టలేక ఆదవడా యీదవడా వాయించి చెవు లెక్కతీసి 'నీ దిక్కున్నచోట చెప్పుకోరా!' అంటూ తరిమేశాడు.

ఆ నిన్న జరిగిన సంగతినే విచారిస్తున్నారు కరణంగారు. వెట్టివెంకడు, కరణంగారి పాలేళ్ళు నలుగురు, అయిదారుగురు కాపులు, రెడ్లు యిద్దరూ, వొక బ్రాంహ్మడూ అక్కడి సదస్యగణం. సూరీడు చేతులు కట్టుకొని కరణంగారి గుమ్మానికి యెదురుగా పది గజాల దూరానవున్న గొడ్లపాక గోడ కానుకొని నిలవబడ్డాడు. తండ్రి రాముడు అతనికి కుడివేపున రెండు మూడు గజాల దూరంలో వొక కఱ్ఱనానుకొని తల వంచుకొని కూర్చున్నాడు. కరణంగారూ, రైతులు వారి పెద్దగచ్చు అరుగుమీద కూర్చున్నారు.

'ఏరా, రామా! మాట్లాడవేంరా? వాడికెంత పొగరు లేకపోతే గొడ్లను తెగబాదడమే. కాకుండా మా పాలేరు కుఱ్ఱాణ్ణి కొడతాడురా!' అన్నాడు కరణంగారు.

'బాబూ! మీ బిడ్డలం. పొరపాటు వచ్చింది. మన్నించాలి, మన్నించాలి.'

"ఏరా, సూరీ! నీకేం పొయ్యేకాలం వచ్చింది? కరణంగారి సంగతి తెలియదూ నీకు?" అన్నా డొక

కాపు సభ్యుడు.

"చూస్తున్నాంగా వీళ్ళపొగరు! మాయదారి గాంధీగాని, కులంలేదు గోదూలేదు. వీళ్ల నెక్కడి కక్కడ అణిచి పెట్టకపోతే యింట్లోకివచ్చి కాపురం చేస్తానంటారు" అన్నాడు సనాతన బ్రాహ్మణ సభ్యుడు.

"అయిందేదో అయింది. 'తప్ప' ని లెంపలు వాయించుకోరా!" అన్నాడొక కమ్మఆసామి యెంతో రాజీమార్గంగా.

ఈచర్యంతా చూస్తే సూరీడులోవున్న యౌవన రక్తం వుడికింది. న్యాయ సమ్మతంగా తనదేమీ తప్పు లేదు. అటువంటప్పు డీదండ నెందుకు? గొప్పవారి గొప్ప తనం తమవంటి దిక్కుమాలిన దీనులను అక్రమంగా శిక్షించడానికా? అతని బుర్రలో తుపాను మొదలైంది. ఏవో యేవో ఆలోచనలతో బుద్ధంతా సుడితిరిగి పోతూవుంది. అంతలో "మాట్లాడవేరా! మూగముంగి లాగా. నీ దిక్కున్నచోట చెప్పుకోమన్నావట వాణ్ణి. వాడికి దిక్కు నేనేరా. యిక నీదిక్కు చూచుకోరా!" అన్నాడు కరణంగారు.

"మీరు గొప్పవోరు; యిందులో మాదేం తప్పుందని మీరట్లా అడుగుతారు. మా పొలంలోకి అన్యాయంగా గొడ్లను తోలితే అదిలిస్తే తప్పా? మీ పొలమే అయితే వూరుకుంటారా? ఎవరికైనా సొమ్మే కదండి" అని నిర్మొహమాటంగా అన్నాడు సూరీడు.

"ఆ! మాటకుమాట జవాబా! అయితే నేను అనుకున్న దానికంటే యెక్కువ పొగరే వున్నదన్న

మాట. ఉహూ! నాకే యిట్లా యెదురు తిరిగేవాడిని నిన్న వాణ్ణే కొట్టావంటే ఆశ్చర్య మేముంది?"

"నిజం చెప్పాను. వ్రేలెడంత వున్నాడో లేడో గొడ్ల నదిలించక చూస్తావేరా? అంటే అడ్డమైన తిట్లూనా? మిమ్మల్ని తిడతా నూరు కుంటారా?" అన్నాడు మోటుగా. ఆమాట కందరూ విస్తుపోయారు.

"అబ్బో! మాదాకా వచ్చిందా, అయితే సరే!" అంటూ నోటికి వచ్చినట్లు తిడుతూ 'ఏంచేస్తావో చెయ్యరా' అన్నాడు కరణం. పేర్పులు తోడుకపోయే ఆదుర్భాషలువినలేక 'మీయిష్టం వచ్చినట్లు చేసుకోండి' అని సూరీడు నాలుగడుగులు ముందుకు వేశాడు. కరణం కళ్లెర్రచేసి 'చూస్తే యేముందిరా?' అంటూ పాలేళ్లకూ, వెంకడకు సైగ చేసాడు. ఆపాళంగా నలుగురు పాలేళ్లూ వెళ్లి సూరీడు రెక్కలు పట్టుకున్నారు. విడిపించుకుంటానికి ప్రయత్నం చేశాడు. ఫలితం లేక పోయింది. ఒక్క డివతలా, అవతల అయిదుగురూ.

సూరీణ్ణి గొడ్లపాక గుంజకు గట్టి చింతబరికతో కొట్టడానికి వెంకడు చెయ్యి సాపు చేసుకుంటున్నాడు. రాముడది చూచి "బాబూ! తెలియనివాడు. నా మొఖం చూచయినా ప్రభువులు మన్నించండి" అంటూ అడ్డం వెళ్లాడు. కరణంగారు కనుబొమ్మ లెత్తేటప్పటికి వైక పాలేరు రాముణ్ణి రెక్కపుచ్చుకుని యివతలకు లాగేశాడు.

ఒకటి, రెండు, మూడు, పాతిక దెబ్బలకు వొళ్ళంతా కమిలి పోయింది. దెబ్బల గాయాల మీద

రక్తం, రాముడి కళ్లల్లో నీళ్లూ వుబికిపోయినై. సూరీడు బోన్లోవున్న పెద్దపులి కూన.

3

"రాముడూ ! నే చెప్పినమాట విను. ఇంకా కుర్రాడు. వాడికి తెలియదు. అనుభవం తక్కువ పని చేసి పస్తాయింపకు" అన్నాడు పెద్దకాపు గురవయ్య యెంతో అభిమానం వుట్టిపడేటట్టు.

"మీరు చెప్పింది నిజమే. కాదన్ను. గొప్పోరితో మాలాంటి బడుగోళ్లకు కక్షలు పనికిరావు. కాని అదే మాజీవనం. మాకా తల్లి భూదేవి అచ్చొచ్చింది. వారి క్కావాలంటే అనేకం భూములున్నాయి. మమ్మన్ని యేడిపించకండి. మీబిడ్డలం" అన్నాడు రాముడు దీనంగా.

"పోనీ, అమ్మమంటే అమ్మనన్నావు. వారి మెరక మడిలోకి నీపొలంలోంచి కాలవన్నాయియ్య" అన్నాడందుకోసమే వచ్చినట్లు.

"ఇది మీకు న్యాయమేనా? పెద్దరైతులు" అంటూ నవ్వాడు.

"ఇక నీకర్మం ! అనుభవించేటప్పుడు గాని తెలియదు. అప్పుడనుకుంటావులే ఫలానా అప్పుడు చెపితే వినలేదని" అంటూ చక్కావెళ్లాడు.

రాఘవయ్య దుర్మార్గుడైనా కరణం. అందుచేత అతనంటే అందరూ వెరుస్తారు. అతనుమాత్రం న్యాయానికీ ధర్మానికీ వెరవడు. పక్కాకుత్సితుడు. చేసినదారుణాలిన్నీ అన్నీ కావు. సముద్రంలో హాలాహలంగా

అందరి హృదయాల్లో అతనిమీద ద్వేషానలం ప్రచ్ఛన్నంగావుంది. అదెప్పుడో వుబికినప్పుడు గాని అతని కొంప కాలదు.

రాఘవయ్య పొలం కాడిగట్టునే రాముడి పొలం కూడా వుంది. నీటి సదుపాయానికి తనదానికి రాముడి పొలమే ఆధారభూతం. తను నీళ్ళడిగినప్పుడు రాముడు వీల్లేదనడం గుండెల్లో మెదల్తూనేవుంది. అప్పణ్ణించీ యేవిధంగా అయినా ఆ పొలాన్ని స్వాహాచేసుకోవాలని చూపు పెట్టుకున్నాడు. తనకేదో ధరచేసి విక్రయించమని కాపు గురవయ్యతో రాయబారం నడిపాడు; ఎట్లాగూ యివ్వడని తెలుసు. పొలంలోంచి కాలవైనా యిస్తాడనుకొన్నాడు. కాని అదీ జరగలా. అప్పణ్ణుంచీ యిదివరకన్నా గుర్రుగావుంది.

రాజు తలచుకొంటే దెబ్బలకొదవా అన్నట్లు కరణం తలిస్తే కానిపని వుంటుందా? రాముడి పొలానికి మెసరు పెట్టాడు.ఎవ్వరివ్వవలసిందో ప్రాతశిస్తు బకాయీ పెకలించి పైకితీశాడు. కలానికి పదను నెక్కించాడు. కరణం చేతికద్దుందా? అది బాగో వ్రాగో ఫలితానికి మట్టుకు అంత ధనవంతుడయ్యీ వొక బీదవాడి పొలాన్ని అన్యాయంగా అపహరించడానికి ఆతని మనస్సు వెను తీయలేదు. గొప్పవాని కొరతలు లోకం అంగీకరించి తలూపుతుంది. కాకపోతే పాపమే పెరగదు. తాతల నాటినుండి తనవరకు అనుభవానికి వస్తూ తమ కుటుంబానికి యేడు గడమైన ఆ యెకరం పొలం కాస్తా శిస్తు చెల్లించలేదనే నెపాన్న— నెపానికే, నిజాన కతని

బకాయేలేదు. కోర్టుద్వారా డివిన్యూ శేలై కరణంగారి బావమరిదిపేర పాడబడి కరణంగారి పొలంలో శాశ్వతంగా అయిక్యమైపోయింది. నిర్భాగ్యపు రాముడు! యీ సంగతే యెరుగడు.

వేలం జరిగి రెండు నెలలైనా పాపం రాముడికానాడే తెలిసింది. అతనేం చేయగలడు? అనాథ. ఆలించేవాళ్లా, పాలించేవాళ్లా, తీర్చేవాళ్లా, ఆర్చేవాళ్లా? ఎవ్వరూ అతణ్ణి ఓదార్పలేదు సరికదా, కరణంగారిది తప్పనికూడా చెప్పలేక పోయారు. కోరి కూర్చుని ఎవరు నిప్పులో చెయి పెడతానికి సాహసిస్తారు? రాముడు కరణంగారి వద్దకు వెళ్లి బ్రతిమాలాడు. "ఛీ పో" అన్నమాట తప్పితే లాభం లేకపోయింది. ఆ నిరుపేద సంసారికి తాతలనాటి నుంచీ వస్తూవున్న మడిచెక్క కాస్తా మంట కలసిపోయింది. రామ రామ!

౪

ఇంకా సరిగా తెల్లవారలేదు. మసి మసి చీకటిగా వుంది. ఒక దుప్పటి కప్పుకొని ములుగర్రి వూపుకుంటూ సూరీడు బాపన సుందరంగారి పొలంలోకి వెడుతున్నాడు. తల వంచుకొని యేదో ఆలోచించుకుంటూ వస్తూవున్నాడు. తన కాలిక్రింది నుంచి పోతూవున్న దారేగాని అతని కింకేమీ చూపుకందకుండా వుంది. శీతాకాలం చలిగాడ్పు జోరుగానే వుంది. చలికి జడిసి పక్షులుకూడా యింకా కళ్లు తెరవలేదు. కొద్దికొద్దిగా మంచుకూడా పడుతూ వుంది.

సూరీడు దగ్గరకు వచ్చేవరకు తను నడుస్తున్న

దారినే వేరొక వ్యక్తి వస్తున్నాడని తెలుసుకోలేక పోయాడు. "చీకటిలో బయల్దేరా వెక్కడికిరా!" అన్నాడా వ్యక్తి. నిండు ముసుగుతో ముఖం సరిగా కనపడకుండా వున్నప్పటికీ కంఠస్వరాన్ని పట్టి ఆనవాలు పట్టాడు కరణంగారని. సూరీడు మనస్సులో ఆ నాడు నూరు దెబ్బలు కొట్టించినప్పటి నుంచి కరణంమీాద కారాలు మిరియాలు నూరుతునే వున్నాడు. అప్పణ్ణించి కరణాన్ని వొక్కంట కనిపెడుతూనే వున్నాడు. ఈమధ్య అన్యాయంగా పొలాన్ని కాస్తా అపహరించడం అగ్నిలో పోసిన ఆజ్యంలాగా భగ్గు మన్నది. కార్చిచ్చుకు హోరుగాలి తోడయింది. ప్రతికక్షి యేకాంతంగా కనబడడంతోనే అంతవరకూ అణిగీ మణిగీ వున్న క్రోధం, అక్కసూ, అన్నీ పైకుబికాయి. చలికి ముడుచుకొని వున్న చిన్నిచిన్ని రక్తనాళాలన్నీ కోపంతో వెచ్చపడ్డాయి. మనిషిలో వున్న రాక్షసత్వం అంతా పైకెగ జిమ్మింది. అతని మెదడులో పిశాచాలు వికటాట్టహాసాల్తో ప్రళయ నృత్యాలు సాగించినై. తెల్లవారే ముందుండే చుక్కలాగా దయా, మనుష్యత్వం యెక్కడో వొక మూాల చతికిలబడి పోయింది—దాని గొడవేలేదు. అతని కంటికి గొడ్డే కనబడు తున్నాయి. చేతిలోవున్న కర్రా. కరణంగారి బుర్రా. కర్ర కదలాలి; బుర్ర ఫక్కు మనాలి. యింతే సంగతి ఆభావంలో మెలిగేది. చేతిలో వున్నకర్ర వూతంకొద్దీ పయికెత్తాడు. కళ్లెర్ర పడ్డాయి. టఫీమని ఒకటే అంటే వొకటేదెబ్బ. అరటిచెట్టు లాగా నిలువెత్తు మనిషీ కూలిపడ్డాడు. మబ్బుల్లోకి

చంద్రుడులాగా గట్లు కడ్డంబడి పైరుమాటుకు జారి మరుగై పోయాడు సూరీడు.

సూర్యుని రత్న కిరీట కాంతులు ప్రాగ్దిక్కునుండి మొలుచుకొని వస్తున్నాయి. రాఘవయ్యకింకా స్మృతి రాలేదు. అటునుంచి యిటు మసిలాడు. అతని అదృష్టం తిన్నగావుంది. సూరీడు కొట్టిన దెబ్బ తలమీద నుంచి జారి యెడం భుజంమీద పడక నడినెత్తినే తగిల్తే పరమ పదమే శరణ్యమయ్యేది. దెబ్బ అంత మోపైందిమటుకు కాదు. కాని యెన్నో లంకణాలు చేసిన మనిషిమో స్తగు తగని నీరసం కలిగించింది. సూరీడెత్తిన కర్ర చూసేటప్పటికి అతని కండ్లముందు భూమీ ఆకాశం వొకటేగా కలిసి పోయినై. తన జీవితం ఆ రెంటి మధ్యా బిగిసి పోయినట్లయింది. కళ్ళల్లో కాటుక పెట్టుకొన్నట్టు కారుచీకట్లు క్రమ్ముకొన్నాయి. యింతకూ లేచినవేళ మంచిది. పాపపు బ్రహ్మ అతని ఆయుర్దాయాన్ని ఆనాటికి గీతకొట్టలేదు. ఇంకా మిగిల్న శేషం యెంతో?

అంతలో ఆ దారినెంట రాముడు వస్తున్నాడు. కరణంగారు శవంలాగా పడివుండటం చూచి ఆశ్చర్య పోయాడు. ఎవరో విరోధులు కొట్టి వుంటారనుకున్నాడు. పొలంలోకి తోలుకు వెళుతూవున్న బండిని మళ్లించి నెమ్మదిగా కరణాన్ని దానిపై కెక్కించి వూళ్లోకి బండి తోలిచ్చాడు. చెంబులు పుచ్చుకుని బయల్దేరిన కాపులూ కమ్మలూ చెరువు గట్టున చేరిన ఆడా మొగా అందరూ బండీ చుట్టూ కమ్మేశారు. రాముణ్ణి యేం జరిగిందంటూ తలో మాటా అడుగుతూ వున్నారు.

చూచింది చూచినట్లు చెబుతున్నాడు. నెమ్మదిగా కర ణంగారి వాకిట్లోకి బండి చేరుకొంది. పదిమంది రకరకాలుగా ఉంటూనే పదిమాట లంటున్నారు. కొందరు "మాలాడివి కదా యెట్లా ముట్టుకున్నావు? బుద్ధిలేదూ?" అంటూ రాముణ్ణి మందలించారు. రాముడు తెల్లబోతున్నాడు. అతనికి కరణం నిస్సహాయస్థితి చూడగానే యెంతో మొదట జాలి గలిగింది. తమ విరోధనీ, పొలాన్ని అన్యాయంగా లాగాడనీ ఈ మొదలైన భావాలేమీ రాలేదు. తోటి మానవుడు పడే అవస్థ చూస్తే హృదయం గల వాళ్ళకు కలిగే దయే అతనికీ కలిగింది. నెమ్మదిగా యింటికి తీసుకొనివచ్చి అప్పచెప్పి నందుకు మేలేమంటే నలుగురూ నాలుగు మాట లనడమే.

ఇంట్లోనుంచి చిన్న కరణంగారి గడిబిడికి కళ్ళు నులుముకొంటూ ప్రక్క దిగివచ్చాడు. రాముడు జరిగిన సంగతంతా చేతులు కట్టుకొని చెప్పాడు. ఆమాటలు వింటూనే అతని కాగ్రహం పూనింది. "అరరే! మాల వెధవా! నువ్వు ముట్టుకుంటావా?" అంటూ కొట్టినంత పనిచేశాడు. ఇంతలో నల్గురు రైతులు కరణాన్ని దింపి అరుగుమీద పడుకోబెట్టారు. అప్పుడప్పుడే స్మృతి వస్తూవుంది. గాలి తగలాలని జనం వొత్తిగిల్లారు. కొన్ని నిముషాలకు కళ్లు తెరిచేటప్పటికి యెదురుగా రాముడు కనబడ్డాడు. వాణ్ణి చూస్తూనే కరణం "ఫీడ్......" అంటూ సగం గొణిగి "కొట్టాడు" అంటూ తేల్చివేశాడు. ఆయన చెప్పకపోయినా కొడుకు అర్థం చేసుకొన్నాడు. "అమ్మ గాడిదకొడుకా! నువ్వే కొట్టా

వుత్రా" అంటూ లంఘించి ప్రక్కన నిలబడ్డ వొక కాపుచేతిలో కర్ర తీసుకొని రాముణ్ణి చితకగొట్టాడు. అంతజనంలో నిజం విచారించే వాళ్లుకాని చిన్నికరణం ఆగ్రహాన్ని తగ్గించే వాళ్లుగాని వొక్కరూ లేకపో యారు.

రాముడి వొళ్లు హూనం హూనం అయింది. తను చేసిన పనికే తనే పస్తాయించాడు. ఏమీ యెరుగనట్లు వెళ్ళిపోతే యీ గ్రహచారం మూడేదికాదు. పుణ్యా నకు పోతే పాపమెదురైంది.

రాముడింటికి చేరు కొనే టప్పటికి సూరీడు అన్నంతింటూ ప్రొద్దుట జరిగిన సంగతి తల్లితో చెబు తూవున్నాడు. యింతలో రాముడింట్లోకి వచ్చి నిలవలేక కూలబడ్డాడు."నాయనా!నువ్వు అన్యాయంగా కరణాన్ని కొడితే, కరణం కొడుకు నీ తండ్రిని కొట్టాడులే" అన్నాడు. రాముడికి దెబ్బలు బాగా తగలడంవల్ల మంచమెక్కాడు.

త్రాచే విషమయం. తోక త్రొక్కితే కావలసిం దేమిటి? పాలేరు జగ్గడు ఘాతుకకృత్యాలకు మొదటి తాంబూలం అందుకున్నాడు వూళ్ళో. రాఘవయ్యకు నమ్మినబంటు. జగ్గడితో మంత్రాంగం జరిగింది. ఏ తప్పుడు సాక్ష్యమో బనాయించి వాణ్ణి నానా తిప్పలూ పెట్ట వచ్చును. కాని వాడు కొట్టినట్టు చెప్పుకుంటే తనకే సిగ్గు. చేసే పని తెలియనట్లు చలిచీమలాగా జరి గించాలి. విధానం అంతా వినిపించాడు. 'ఊ' అన్నాడు జగ్గడు. ఆరాత్రే కావాలన్నాడు కరణం. 'సరే' అన్నాడు

జగడము.

అర్ధరాత్రివేళ మాలపల్లి గొల్లుమంది. రాముడిల్లు తగలపడుతోందంటే రాముడిల్లు తగలపడుతోందన్నారు. అందరూ కంగారుపడే వారే. కడవలతో చెరువును పల్లెలోకి జారేసారు. ఇంట్లోవున్న వాళ్లంతా గొల్లు మంటూ మంటచూడగానే బయట పడ్డారు సురక్షితంగా. కాని రాముడు లేవలేక లేస్తూ మంటలోకి వెళ్ళి పడ్డాడు. ఎట్లాగైతేం తెచ్చి యివతల పడేశారు. సూరీడింకా మంటార్పే సందడిలోనే వున్నాడు. మంట నార్పారు. కాని 'మంటలో, మంటలో' అని అరచే ముసలి రాముడి మంట యెలా ఆరుతుంది? ఒళ్ళంతా కమిలిపోయింది. స్మృతి కూడా పోతూవుంది. రాముడి బ్రతుకు క్రిందు మీదులుగావుంది. అగ్నిహోత్రుడు నిశ్శేషంగా గుడ్డా గుడిసూ ఆహారించాడు. చెట్టు మీది పక్షిలా అలా నిలిచి పోయింది కుటుంబం అంతా. ఇంకా తూర్పుకొండ యెగ్రవారకముందే తన ప్రాణ వాయువుని అనంతాకాశంలో లీనం చేసేశాడు రాముడు. దానితో రాముడి వాళ్లువుంటూ తీరంపు. కర్మ మనసులోని మంటా చల్లారింది. పిల్లా జెల్లా వొళ్ళ నాటిగా గుల్లాల్ల వున్నారు.

ఏడాది గడిచిపోయింది.

రాముడి యిల్లు దిబ్బయింది. మిగిలినవాళ్లు ఎక్కడివాళ్లక్కడ చీలిపోయారు పొట్టచేత్తో పుచ్చుకొని. ఇక వాళ్ళకు వూరితో సంబంధం యేముం

వని వుంటారు! యీయేడాదిలో యెన్నోసార్లు యెం దరో రాముడు పాకింటివద్ద కూర్చుండగా చూశామనీ, పొలం లోంచి వస్తూ వుండే చూశామనీ కరణంగారి యింటి నడికప్పుమీద కూర్చుంటే చూశామనీ, చెప్పు కొనేవారు. అందరూ కలిసీ చివరకు నిర్ణయించిం దేమంటే రాముడి బలవన్మరణమనీ అందుకని అతని ప్రాణాలు పిశాచత్వాన్ని పొందినవనీ. కొందరదంతా వట్టిదేనని యెగరకొట్టారు, కాని మొత్తంమీద దీపాలు పెట్టాక రాముడింటికేసి వెళ్లినా పొలంకేసి వెళ్లినా మర్నాడు తప్పకుండా జ్వరం వచ్చితీరేది.

ఈ యేడాదిలో వూరుకూడా కాలంవల చాలా మార్పులు వచ్చాయి. ఊళ్లో మశూచి ప్రవే శించి కొన్ని కొంపలు ఆర్పింది. ఊరుచిక్కి సగం అయింది. కరణంగారి యింటికి దాని యాఘాతం విశే షంగా తగిలింది. దాని ఆహారం క్రింద భార్యనూ, పెక్కగాని వాళ్క కొడుకును అప్పగించి తను మిగి లాడు. జీవితంలో యింమమించతను పంచమాశ్వానికి వచ్చినట్లు భావించుకున్నాడు. అతని గుండెల్లో వాక పోటుబయల్దేరింది. అది నియమం లేకుండా యెప్పుడు పడితే అప్పుడు బాధిస్తూవుంది. అనేకమంది తెనుగు వైద్యాలు దానిముందు చేతులు కడుక్కొన్నారు. పట్నం వైద్యులుకూడా కత్తులు నూరారు. కాని అది యెవరికీ లొంగనిది. చేదుమందులు తినలేక కరణానికి విసుపు పుట్టింది. తగ్గుతుందనే యెరపల్ల అబాధ రాజ కన్యలాగా యెన్నో ప్రవర్తనలూ పొందుతూవుంది.

అతని బాధలో అతడు చేసిన పాపాలు అల్బంలో బొమ్మల మోస్తరు కళ్లముందు గిర్రున తిరుగుతున్నాయి. కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. ఇంతలో [illegible] సమయంలో కర్రి పుచ్చుకొని కమిలిపోయిన వ్రేళ్లు మాడుకంపు కొడుతూవుంటే రాముడు వచ్చాడు. రాముణ్ణి చూస్తూనే కరణం కెవ్వున కేకవేశాడు. నౌకరు "ఏం బాబూ?" అంటూవచ్చాడు. ఎవ్వరూ లేరు. అంతా భ్రమ!

రక్తి చెడేగాని మానవుడు విరక్తికి త్రోవ తీయడు. బొప్పి కట్టిన తరువాతే నిలువెత్తు మనిషీ గుమ్మం దగ్గరకు వచ్చి వంగుతాడు. రాఘవయ్య బుద్ధి ఇప్పటికి సరయిన మార్గంలో నడిచింది. ఇప్పటికి అతని దౌర్భాగ్యం తిరుగుమొగం పెట్టింది. చిత్తం ఇహాన్ని దాటి పరంకోసం ప్రాకులాడుతూ వుంది. అంతా చీకటి రాత్రి! పరలోక యాత్రకు మార్గం సుగమంగా లేదు. ముక్తి ద్వారాలన్నీ బిగించివున్నాయి. ఏకాకి అయిపోయాడు. పశ్చాత్తాపం నిలువెల్లా దహించి వేస్తూవుంది. ఒక్క నెలలో అతను యెండిన వరుగై పోయాడు. కళ్లు లోతుకు పోయినై. దవడలు త్రోసుకొని యెముకలు పైకి వచ్చాయి. అతని కెటుచూచినా 'నా' అనేవాళ్లు లేరు. చచ్చిం తరువాత ఆస్తికోసం మాత్రం జ్ఞాతులువున్నారు శవాన్ని పీక్కుతింటానికి నక్కలు కనిపెట్టుకొని వున్నట్లు. చేసిన పాపాలు నిష్కృతికి తల్లడిల్లి పోతూవున్నాయి. అతని గుండెలు అనవరతం రావాకు కొనలాగా అల్లల్లాడి పోతూవున్నాయి. కన్ను మూసినా తెరిచినా

రాముని దర్శనం లభ్యమవలేదు. అతను చేసిన ద్రోహాల్లో ఇదే అధికతమం. పొలంపోయింది. కొంపకాలింది. తండ్రి చచ్చిపోయాడు. సూరీడికి చేసిన ద్రోహం దాంచేస్తే తీరుతుంది. అతనికి కావలసింది ఆత్మశాంతి. శాంతి కోరకేమి చేయటానికీ తెలుసుకోడు. అతని కష్టానికి మతి మారింది.

ఇల్లు తెగలబడిం తరువాత సూరీడు తన ముసలి తల్లితో జీవనానికి అల్లాడి మల్లాడి పొరుగూరిలో వొక రైతుదగ్గర పాలేరై చాలా నికృష్టస్థితిలో వున్నాడు. రాఘవయ్య అతనికోసం మనిషిని పంపించాడు. మర్నాడే సూరీడు వచ్చాడు. గుమ్మంలో నిలబడ్డాడు. అతణ్ణి చూచి మంచంలోని మనిషి అమాంతంగా లేచివెళ్ళి కౌగిలించుకున్నాడు. అతనింకా ఆశ్చర్యంనుంచీ తెప్పరిల్లక మునుపే చేతిలో కాగితంపెట్టి యిదే నాపాపాల కన్నిటికీ 'నిష్కృతి' అన్నాడు.

---

# చిల్లిచెంబు

అంతచిన్న విషయంకూడా సముద్రంలో లేచిన తుపానులాగా కుటుంబాన్నంతా చెయ్యిపెట్టి కలచి వేసింది. ఊబిలో కుక్కుకుపోయిన చిల్ల పెంకుల మోస్తరు మనసులో మాటుపడివున్న వొక్కొక్కరి కోరికలు పెల్లగిలి వచ్చాయి.

రామచంద్రం సిరిసంపదలకు చిన్నపిల్ల 'దేవి' జన్మనాటికి జరావస్థ ప్రాప్తించింది. అంతవరకు పూల తోటలాగా వున్న ఆయిల్లు ప్రస్తుతానికి కొండపల్లి ఖిల్లా అయింది. పున్నానికి వెన్నెల, అమాసకు చీకటీ. కడుపు నింపుకొంటూ శల్యావశిష్టమైన ఆ మిద్దెటిల్లు ఆ కుటుంబం తలదాచుకొనేందుకు చిరుగుల గొడుగు. పెరట్లో బావిమట్టుకు యింటివారి దారిద్ర్యంలో పాలు పంచుకోక పస్తు పడ్డనాళ్ళలో కూడా గొంతుక తడియారి పోకుండా చూస్తూ వుండేది. అందుకూ అడ్డంకులైన పాప జీవాలు: మాటి మాటికీ పెరిగే త్రాడూ, తడిసి తడిసి జల్లెడయిన చేదానూ.

రామచంద్రానికి ముప్పది యేళ్లు మీదికి వచ్చే వరకు చింతా చీకూ తెలీదు. భార్యా తనూ సరదాగా కాలక్షేపం చేయడం; వేళకు వంటకత్తె పిలుపు అందుకోవడం; మరీ దేవుడు మేలుచేస్తే ముత్యాల లాంటి బిడ్డల్ను కనడం. పెద్దమ్మాయి సరస్వతి, తరువాతివాడు రాఘవులు(వీడికే తండ్రి పేరు పెట్టుకొని ఋణం తీర్చాడు) ఇక చంటిపిల్ల మాణిక్యం. అప్పటికి మాతృ గర్భంలో తయారవుతూవున్న నాలుగవపంట సావిత్రీదేవి. అటువంటి అసందర్భంలో చాలా తొందరపడి రామం తండ్రి కాలాన్ని అనుసరించాడు. తండ్రి చావుతో రామానికి బారెడు పొడువు తలజరువు తగ్గిందన్న మాటేకాని, కొండంత సంసారం విరుచుకొని పడింది. అతనికి గల సామర్థ్యాలలో నాటికి నూరు మాస్కులు సంపాదించుకొన్నది ప్రక్క పిల్లల్ను కని సృష్టికి చేయూత నివ్వ

డమే. చదువుకొనే కాలంలో గణిత శాస్త్రం వలె, యిప్పుడతనికి కాపురం కొరుకు పడక కన్నీళ్లతో కండువా తడిసి పోయేది. బొత్తిగా లోకజ్ఞానం లేదంటే లేదు. అతనందుకు బాధ్యుడని చూస్తూ ఎలా అంటాం?

అప్పుల వాళ్ళు ఆ అమాయికుడి మీద దయా దాక్షిణ్యాలు లేని యినుప పాదాలు మోపారు. ఆ బరువుకు గుమ్మడికాయంత సంసారం కుదేలుపడి పిసరు పిసరయింది. భూములూ పుట్రా యితరులు తగులుకొని పోయినవి. ఋణ దాతల కరుణాస్వరూపానికి గురుతుగా ఆరిసి కాయిల్లు సర్వస్వామ్యాలతో మిగిలింది. ముత్యం లాగా తళతళలాడిన ఆ కుటుంబం కాలగతివల్ల చివరకు చితికి నీటి బుడగలాగా అయింది. ఆ బుడగలో నిరాధారంగా నిలిచున్న వాళ్లు, పిల్లలుకాక, తనూ, తల్లీ, యిల్లాలు. అదే సమయంలో సావిత్రి పుట్టుక.

పిల్లలతో పాటిగా ఒకటి-రెండు-మూడేళ్లు అతని అప్రయోజకత్వం పెరుగుతూనేవుంది. కాని జరిగిన దహాస్యేమంటే? ముందు ముందు యింట్లోవున్న బంగారం—పెళ్లాం మెళ్ళోని రెండు చిన్నాల పాతిక పుస్తె తప్ప—సర్వం ఖర్చుఅయింది. ఆటు తరువాత అస్థానాన్ని ఖర్చీ చేసింది, వెండిగిన్నెలు కంచాలు. కదపట సాలు గొప్పవి యిత్తడి బిందెలు, చెంబులు. అన్నీ వాటివాటి భక్తి విశ్వాసముల కొద్దీ కడుపుమంటలో కరగిపోయి కొన్నేళ్ళను బలవంతంగా యీడ్చుకొని పోయినవి. చివరకా యింట్లో కోపంవస్తే మెడ కోసుకుంటానికి కత్తిపీట కూడా కరువైపోయింది.

ఇదంతా అతని వెనుకటి జీవితాన్ని సింహావలోకనం చేస్తే తేలే సారాంశం. జరిగిన విషయానికి ముఖ్యంకాదన్నా—రామచంద్రం మీద మనకు పుట్టే జాలికి యిది దోహదం మాత్రకు అవుతుంది.

ప్రస్తుతంలో— యిల్లంతా ఆక్రమించుకొన్న తెబరం, ఎప్పటంత తెలివితేటలు లేని రామానికి వ్యవహార కౌశలం నేర్పినా నేర్పక పోయినా గ్రామంలోని కమ్మకూ కాపుకూ దయమాత్రం కలిగించింది. 'అమాయికపు బ్రాహ్మడ'ని అందరూ తలోచెయ్యి వేసి ఆ కుటుంబాన్ని లేవదీశారు. రామం కూడా అందరికీ తలలో నాలుకలాగా మెలగేవాడు. ఏ పెళ్లికయినా పర్యవసానం ఆ కుటుంబం గ్రాసవాసో దైన్యాలకు తప్పి దాటినట్టైంది.

ఇక్కడొక సంగతి చెప్పాలి. రామచంద్రానికీ నాకూ ఉగ్గాల్యమైన పరిచయం, అంటే వొకసారి ముఖావలోకనం చేసినంత సంభాషణా కాదు. మైత్రి అనేదానికి అంగుళం మేర తక్కువ అయిన పరిచయం వుంది. నాతో పైనా అంతగా తరుచుగా యెవరితోటీ కష్టసుఖాలు వివరించే వాడుకూడా కాదు. 'నా మేష్టర్ గిరిలో మిగిలే ఏ చిల్లరడబ్బులో అప్పుడప్పుడూ కుటుంబానికి అక్కరకు వచ్చేవి. ఊరిలో బ్రాహ్మణాయన, ప్రవాస్యగ బ్రాహ్మణ్ణి నేనూ.

సమయం నాలుగ్గంటలు. ఆదివారం విశ్రాంతి అనుభవిస్తూ కూర్చున్నాను. ఇంతలోనే అంగవస్త్రం మూటతో రామం ప్రత్యక్షమయ్యాడు. శేష ధనం

యితనితో సాగించవచ్చు ననిఅతని ముఖకళలను పట్టి వూహించుకొంటూ వున్నా. 'ఇలా రావ్వోయి, ఏమిటీ విశేషాలు?' అంటూ కుశల ప్రశ్న చేశాను.

"విశేషాల కేమిలే! నీతో వొక సంప్రదింపుకు వచ్చా" నంటూ అటూ యిటూ చూచి తలుపుకు తన వీపు ఓరచేసి మూటవిప్పి అందులోవున్న వొక చిల్లి వెండి చెంబుక్రింద పెట్టాడు కథ ప్రారంభిస్తూ. ఆ ప్రవాహానికి అడ్డు లేదు.

"నిన్న మా రాఘవుడూ, మున్సబు కొడుకూ బంతి ఆడుకొంటూవుంటే అది వెళ్ళి మిద్దెమీద పడింది. బంతికోసం యిద్దరూ పెనుగులాడుతూ వున్నారు. నేను వచ్చి సంగతంతా విని కయ్యంమాన్పి వోపిక చేసుకొని మిద్దెక్కాను. బంతికోసం ఆ చీకటి గర్భంలో తచ్చాడుతూ తారాడుతూ వుంటే వొక మూల కాలికీ చెంబు తగిలింది. ఇదివర కెన్నోసార్లు ఆ మిద్దెనంతా గాలించి విడిచాను. ఎప్పుడూ దీనివాసనే తగల్లేదు. అప్పుడు మట్టుకు నా వుద్దేశంలో యే యిత్తడి గిన్నో యే సత్తు చెంబో అనుకున్నాను. ఆ బంతిని చివరకు సాధించి వాళ్ళ కిచ్చాననుకో. దీనిని మట్టుకు అలాగేవుంచి దిగి వచ్చాను. కాని, మళ్ళీ పైకియెక్కి ఆ చెంబుతీసి దానిని కడిగించి చూస్తే వెండిచెంబు. నాకు చాలా ఆశ్చర్యం వేసింది 'వెండిచెంబు అక్కడ కెట్లా ప్రాకిపోయిందా' అని.

ఇంచుమించు నలభై యాభై తులాలకు తక్కువుండదు. అమ్మితే యిరవై రూపాయిలేనా రావ

చ్చును. కాని—"

అని, రామం హఠాత్తుగా స్టేషన్‌లోకి బండి వచ్చి ఆగిపోయిన స్లాగి పోయాడు. అంతవరకూ వింటూనే వున్నా. అంతగా అత నాగిపోవలసిన భావరహస్య మేమీ నా కగుపించలేదు.

"ఏం? అమ్మితే యిరవై, ఆ పైమూరున రా వచ్చు!" అన్నా నిశ్చయార్థకం చూపుతో అతన్ని చూస్తూ.

"రావచ్చు; కాని మా యింట్లో వాళ్ళకు, ఒక విధంగా, మా అమ్మకు వొకవిధంగా అభిప్రాయ భేదాలు కలిగినై. మా అమ్మ పెద్దల కాలంనుంచీ నా వరకూ మా యింట్లో పూజా పురస్కారా లందుకొంటూ వుండేదని, నా హయాంనించీ. లేనిపూజలు లేకపోగా. వున్న బంగారపు విగ్రహం కాస్తా ఆకలి మంటకు అహుతి కావలసివచ్చిందనిన్నీ, అప్పటినుంచే మాకీ అతిదరిద్రమనీ, యిప్పటికైనా ఆస్థానే వెండి ప్రతిమ చేయించేనా పూజ చేస్తూవుంటే బాగుంటుందని సమ్మ తంగా చెప్పింది. అమ్మ చెప్పిన విషయ మేదీ కాదన డానికి వీల్లేదు. కనుక యింతలో మునిగి పోయిన దేమీ లేదు. అందంగా చేయించాలన్నా అయిదారు తులాల కన్నా యెక్కువ ఖర్చుపడదు. అవసరమూ లేదు అంతకన్నా.

సరే యిక, మా కడసారికాన్పు సుందరానికి— దేవికి తరువాత వాడు—వెండి గిన్నైనా చేయించ వలసిందనిన్నీ, ఇది అమ్మివేస్తే ఆ వచ్చేడబ్బు కర్పూరం లాగా కాస్తీ అయిపోతుందనిన్నీ, వొక వేళ అది కనపడక

అప్పుడప్పుడు చేబదుళ్లు పుచ్చుకున్న బాపతు మొత్తం నలభై యాభై రూపాయీ లుంటవి. మాతండ్రి గారికీ ఆయనకూ వుండే అన్యోన్యత వల్ల మా కుటుంబాన్ని వోకకంట కనిపెడుతూనే వున్నాడు. నూటికి నూలు పోగన్నట్లు యీ చెంబుతో ఋణం శుద్ధిచేసుకోవాలని. మాలో మాకు యీ చిల్లిచెంబు తీరని సమస్య అయిందోయి!"

అంటూ అసమాప్త మగు భావస్ఫూర్తితో నావంక ప్రశ్నార్థకాలైన చూపుల్తో చూచాడు.

సాయంకాలపు పశ్చిమాకాశంవలె శబలితమైన అతని మనస్సులోని భావాలు గడియకొక విధంగా పరివర్తనం చెందుతూ ప్రతి ఫలిస్తూ వున్నాయి. గతించి పోయిన జీవితమంతా అతని తలలో విచిత్రంగా పునరనుభవానికి వస్తూ వున్నట్లు అతని వాలకం చెప్పక చెబుతూవుంది.

అప్పటి శాంతికి భంగము కలిగిస్తూ 'చివరకేమి స్థిర పచ్చుకొన్నావు?' అన్నా నేనూ అతని వేదనలో వాలు పంచుకుంటూ. అతడింకా భావ తీవ్రతలోనో, సంఘర్షణలోనో, క్రిందుమీదవుతున్నాడు. మళ్లీ నేనే 'ఏమాలోచించావంటున్నా' అన్నా బిగ్గరగా.

"అందుకనేగా నిన్ను సంప్రదించాలని వచ్చింది" అన్నాడు ఏగ్రతకతో. 'నేనుమాత్రం ఏం చెప్పను?' అని అసమర్థత వెళ్ళబుచ్చుతూ అన్నా.

చివరకి కిద్దరం ఆలోచించి దాన్ని విక్రయించ దానికే పూనుకొన్నాం. అతనికంటే నేనుండే మాల్లాడ

వచ్చునని అతడు బలవంతం చేస్తే 'సరేలే' అంటూ కండువా వేసుకొని బయల్దేరాను.

పెద్దవీధిలో నన్నెరిగున్న విశ్వకర్మ వొకతను వున్నాడు. గ్రామానికంతా వెండి బంగారు సామాన్లు కొనేవాళ్లిద్దరు. అందులో నన్నెరుగున్నతడు కొంత ధర్మచింతన గలవాడు. అతని దగ్గరకే వెళ్లాం. తులం వడ్డణాల చొప్పున అతని మెడలు విరిచి వొప్పించాం. బేరం కుదిరిన వెనుక చేతికి మూటవిప్పి చెంబు అందించాడు, ఎన్ని తులాలు వుంటుందో అనే ప్రతీక్షతో.

కంసాలి ఆ చెంబు నటు నిటు త్రిప్పి పక్కున నవ్వుతూ "బలే బేరమండీ! పంతులుగారూ!" అన్నాడు.

ఒక్కసారి యిద్దరం 'యే' మన్నాం, ఆత్రుతతో యేదో దొంగతనం చేసింది బయటపడ్డట్టుగా.

"ఇది యిత్తడి చెంబుమీద వెండి గిల్టండీ" అంటూ ఆకురాతితో దానిమీద వ్రాసి, తనమాటకు సాక్ష్యం చూపించాన్నట్టుగా మావంక జూచాడు. నిజానికిది నిజే! ఒకరి మొగం వొకరికి చూపకుండా వున్నపాళాన బయల్దేరాం.

## పుణ్యాత్ములు

ఆనందరావు:—

భవనంలో చాలా అడావిడిగా వుంది. వచ్చే వాళ్ళు, పోయేవాళ్ళు, వొకరికి వొకరు మధ్య నెదురౌతూ

పోవని చీకటి. నిజంగా ప్రపంచం విడిపోవని చీకటేమో! ఈ ప్రపంచపు మాయవెలుగు అంతర్ముఖములైన అతని కండ్లను మోహింప చేయలేక వెనకకు తిరిగింది. ముడుతలుపడ్డ ఆ నుదుటి చెమ్మలో యెన్ని పుణ్యాలు తడిసిపోయినవో! ఎంతటి అదృష్టం కరిగిపోయిందో!!

ఆతనూ చెక్క మాసినగుడ్డ ముందు పరచుకొనివున్నాడు. అతని ప్రక్కనే పదేళ్ళబాలిక. దారిద్ర్యానికి ఆ బిడ్డ చెక్క అంగారం. ఆ ముసలివాని ప్రక్కనొక కఱ్ఱ. అతనికి లోకం ఆ పిల్ల; ఆధారం చెక్క కఱ్ఱ; అతడు లోకానికెందుకూ కొరగాని పనిముట్టు. కాని ఆ పిల్లను సంరక్షకుడు; ఆ కఱ్ఱకు యజమాని; అతనికి పూట వెచ్చం ఆ పరచిన చింకిగుడ్డ సంపాదించాలి. గుడ్డ పరుచుకొని కూర్చుంటే వస్తుందా? దాని కొన్నిమాటలు కలిపి వంకర టింకరగా అరవాలి.

"తండ్రుల్లాలా! బాబుల్లాలా!!
చూడ—

కుంటీ కండ్లా లేవూ
కన్నతండ్రులు కనికారించండి!!!!"

పాటలో రాగం లేదు; తాళం లేదు; అతనేమీ గానసభ చేయడంలేదు. అది వచనం కాదు, పద్యం అంతకంటే కాదు! శబ్ద స్వరూపాలు చెడిపోయినయ్యి. అదేమీ లాలిత్యం కాదు. శ్రావ్యతా కరుణ కాదు. [illegible] వాడి మానవుని హృదయం కరగించి గుప్పెడు మెతుకు వేయకపోతే ప్రక్కనే బిచ్చగాడు. కంపున్నవాడు చూస్తూ [illegible] [illegible] [illegible] [illegible] చేస్తూ

వెళ్ళారు. వెయ్యాని వారిని బలాత్కరించలేను. కోర్టు గుమాస్తా కాదు బలిమిని పార్టీలవద్ద గుంజుకోవడానికి. ఇన్‌కంటాక్సు ఆఫీసర్ కాదు వర్తకులపై బడి బలవంతం చేయడానికి. చివ్వరకు బీటు కనిస్టేబులైనా కాదు జనాన్ని అదమాయించటానికి. లోకానికి కొరగాని పనిముట్టు! వట్టి పనికిమాలిన పనిముట్టు!! వేసిన వారిని దీవించక విడువలేని కృతజ్ఞుడనుకోవాలి. ఆ పదేళ్ల పిల్లకూడా తన భావి జీవిత నిర్వాహణానికి రహదారి యిదేనని గ్రహించింది కాబోలు! తనగొంతు తాతయ్య ముసలి గొంతుతో కలిపి సన్నసన్నగా

"తండ్రుల్లాలా! బాబుల్లాలా!!

చూడ—

రెండూ కండ్లూ లేవూ

కన్నతండ్రులు కనికారించండీ!!!"

అని పాడుతూ అనుకరిస్తూవుంది. ఆపిల్లను చూచి చెమ్మగిల్లిన నా కన్నుల్లో చిన్ని వెన్నెల పొడ లేచింది. పండి రాలనున్న ఆకు—దాని క్రింద అప్పు డప్పుడే మొదలు సాగిన నవపల్లవం. వాడి వరుగై పతనోన్ముఖమవుచున్న పుష్పం—దాని ప్రక్కన విడీవిడువని రేకులతో ఆకుల చాటున వున్న చిన్ని కళిక. పశ్చిమాకాశంలోని పారాణి రంగుతో పాటు మాయ మవుతూ వున్న కడసారి సూర్య కిరణం—దాని కెదుట గుండా మబ్బు తెర లో త్రిగించు కొంటూ వస్తూవున్న లేతచుక్క—ఈ ఆకు పసరు పట్టుగా చూచే కలిపి పండుటాకును లేదు. ఈ మొగ్గ రేకులు విప్పగా కనే అదృష్టం రాలు

పుష్పకు రాదు. ఈ చుక్క వెలుగు లేశం అరసే భాగ్యం ఆ అంతిమ కిరణానికి పట్టదు కాక పట్టదు!

ఎందరో భక్తులు ఆ దారిన వెళ్ళారు. ఎందరో కృతార్థులు ఆదారిన తిరిగివచ్చారు. ఒక బిచ్చగాడు పరచిన గుడ్డ కంటి కింపుగా కనబడటంలేదు. గర్భగుడిలో వుక్కిపోయే అరటిపండ్లూ, ముక్కిపోయే కొబ్బరిచిప్పలూ వొక్క దరిద్రుడి ఆకలి చల్లార్పలేకపోయినవి. వచ్చి పోయేవారి దృష్టంతా దేవుడి మీదనే. అన్యథా అనుకుంటే పాపం.

అరుగువారనే వొక పొడుగుపాటి కర్రకు గడ్డి చుట్టి దానినిండా వాయించే చిన్ని డప్పులు గ్రుచ్చి అమ్ముకొనే సాహేబు నిల్చున్నాడు. అతని పని చాలా గిరాకీగా వుంది. కన్నబిడ్డతో వచ్చిన ప్రతి తల్లీ కానీ యిచ్చి డప్పుకొనకుండా కాలు కదల్ప లేకపోయింది. కొందరు కొంటె కోనంగులు వద్దంటూవున్నా ముసలి అమ్మమ్మల నిలవేసి మరీ కొనిపించారు. పిల్లలేకాదు, పిల్లతనం వదలని యువకులుకూడా కొని వాయిస్తూ విలాసం వెళ్ళబోస్తున్నారు. కొందరు దూర పాలోచన గల పెద్దలు యింటివద్ద వున్న పిల్లలకని కొని తీసుకు వెళ్తున్నారు. వొక ధనవంతుల బిడ్డడు కాబోలు వొకటి చాలక రెండుకొని రెండుచేతుల్లో పెట్టుకున్నాడు.

తాత దగ్గరవున్న పిల్ల కళ్ళువిచ్చి విస్ఫారితాలు చేసి యీ చిత్రం చూస్తూవుంది. కష్టసుఖ మెరుగని ఆ బాల్య చాపల్యంలో వొకడప్పు కొనాలన్న బుద్ధి పుట్టింది. తాత నడుగవలె ననుకొన్నది. ఏమంటాడో

అని వెనకకు తగ్గింది. కళ్ళు లేస తాతను పొరపెట్టడం ఆ పిల్ల కొక ఘనకార్యం కాదు. అయినప్పటికి ఆ పిల్ల కా పాడుబుద్ధి కలుగలేదు. సాహేబు దగ్గర చూస్తూ వుండగానే డబ్బుగలవారి పిల్లలకు ముచ్చట తీర్చడానికి ఆ డప్పులన్నీ చెల్లిపోతూ వున్నాయి. అదిచూచి ఆ పిల్లకు ఆరాటం యెక్కువయింది. ఒక డప్పు; మూడు దమ్మిడీలు కరీదు చేసే డప్పు;ముగ్గురి పుణ్యాత్ముల పుణ్య ఫలం యేకాకృతి వహించిన డప్పు! చుట్టూ యెర్రని చక్కని కాగితం. చెవ్రలకు నిషా యెక్కించే మ్రోత. ఇక మనసు పట్టలేక పోయింది. "తాతా! వొక డప్పు కొనుక్కో వద్దూ?" అన్నది సంకోచిస్తూ.

ఆ ప్రశ్నకు యెండి పోయిన ఆముసలి పెదవులలో వొక చిన్న నవ్వు. అమావాస్యాంధకారంలో వొక శరచ్చంద్ర చంద్రికా శకలం! అప్పటి వరకు అరచి అరచి సంపాదించిన మొత్తం ఫ్రిక కానీ, అయిదు దమ్మిడీలు. అందులో తన మనుమరాలి కోరిక క్రింద మూడు దమ్మిడీలు వినియోగించలేడూ? అతని కళ్ల వెంట నీళ్ళు కారినవి. కాని, "తల్లీ! అల్లాగే కొనుక్కో!" అన్నాడు.

ఆ చిన్న బిడ్డ తాత కన్నీళ్ళేమని భావించుకొందో? అతనెట్లా అర్థం చేసుకొందో? "వద్దులే తాతా! వూరికే అడిగా" నంది. ఆచిన్ని తల్లికి తాత కన్నీరెంత సంయమనం నేర్పింది! అనుభవ మెంత కూర్చింది!

"కొనుక్కో తల్లీ! కొనుక్కో! ఇదిగో కాని" అని తీసి యిచ్చాడు తాత. కాని, కానీ ఆ పిల్ల తీసుకోలేదు.

"అక్కర్లేదు తాతా! అయ్యో గొప్పోరి కోసమే

మనకొద్దు." అన్నది.

"అంతే తల్లీ! అయ్యో గొప్పోరికే మనకొద్దు." అని ప్రతిధ్వనించింది తాత కంఠం.

*　　*　　*

అతను చాలా గొప్పవాడు. వేలకు మించిన రాబడి. ఎంతవరకో చదువుకున్నాడు. పిల్లా జెల్లాతో సుఖంగా కాలం గడుపుతూ వున్నాడు. అతనికి పేద లంటే చాలాదయ. కన్నీరు చూడలేడు. ఎంతమందికో ఆశ్రయ మిచ్చాడు. కడుపుమాడే కార్మిక జనానికీ, అన్నంలేక అల్లాడే దరిద్ర కంకాళ మూర్తులకు అత డండ. తోటి ధనవంతులంటే అరకాలి మంట తల కెక్కింది. వారు హృదయం లేకుండా చేసే అన్యా యాలను యెదుర్కొనే వాడు... పారిశ్రామిక జనం హక్కుల కోసం అతడు చేయని కృషీ, తలవని రోజూ లేదు. అందుకనే అతడంటే ధనవంతులకు పగ; అధికారు లకు ద్వేషం. అతనికి వొక కొడుకు. ధనవంతు లందరూ అతణ్ణి సాధించాలని ప్రయత్నం. దాని ఫలితంగా కొడుకుని రహస్యంగా చంపించారు. దానితో అతనికిసగం చావుకలిగింది. కొడుకునకు మారుగా అతని చిహ్నం, వలపు మొలక అయిన నెల గ్రుడ్డును పిల్లను పెంచు కుంటూవున్నా డయిదు ప్రాణాలూ ఆమె కంగరకుగా చేసి. ధనవంతుల కుట్రలలో అతని సంపత్తంతా అరతి కర్పూరం అయింది. అతడుకూడా కూటికి గుడ్డకు యెడపై పోయాడు. ఈ చింతతో యిల్లాలు కాలం చేసింది. మహాచికంలో కోడలు పోయింది. ఇక శేషం

చంలో తనకు ఆ చిన్న పిల్ల; ఆ చిన్న పిల్లకు తనూ బంధువు లయ్యారు. ఆ దీనస్థితిలోనే అల్లారు ముద్దుగా ఆ రేళ్లవరకూ ఆపిల్లను పెంచాడు. అంతలో హఠాత్తుగా యేదో జబ్బు చేసి రెండు కళ్లూ పోయినవి. అప్పటి నుంచీ లోకం అంతా ఆ పిల్లే —

*   *   *

ఈ కథంతా అతని విషయంలో 'ఇట్లా అయి వుండకూడదా?' అంటూ నేనూహించు కొంటున్నా. జనం సందడి తగ్గింది. నలువంకలా చీక ట్లలుముకొంటూ వున్నాయి. మన సింటివేపు మొగ్గింది. ఒక్కసారిగా అనుకోకుండా ఆ ముసలి భిక్షకుడూ, నేనూ యింటి వైపు దారి తీశాం. పిల్ల కర్రి పుచ్చుకొని ముందు నడుస్తూవుంటే అతనూ; అతని వెనుక నేనూ. ఆరోజు సంపాదన లెక్కచూచుకున్నారు. మొత్తం పదమూడు పైసలు. "యివ్వేళల్లా పదమూడు దమ్మిడీ లేనా! ఎంతో మంది బాబులు వచ్చారు, యిచ్చిన పాపాన పోలేదు." అన్నది పిల్ల దగ్గుత్తికతో.

" అల్లా అనకు తల్లీ! వారే పుణ్యాత్ములు " అన్నాడు తాత.

"నిజమే? వారేనా పుణ్యాత్ములంటేను?" అను కొన్నాను నేను. పిల్లా, తాతా, మాట్లాడు కొంటూనే వున్నారు. లోకాన్నంతా వడకట్టి సారం తేల్చుకున్న వాడు తాత. సూర్యకిరణమంటే యేమిటో తెలియకుండా ఆకుల చాటున దాగివున్న మొగ్గలాంటిది పిల్ల.

వారిని చూచే టప్పటికి నాకెందుకో తగని జాలి

పుట్టుకు వచ్చింది. అణా దమ్మిడీతో రోజల్లా పస్తున్న ఆ రెండు పొట్టలూ తృప్తి పడాలి. మళ్లీ రేపటి కుంటుందో అసలే వుండదో. నాకు రోజుకు రెండు అణాలయినా కిళ్లీలు సిగరెట్లకే తగలడతాయి. ఇక కాఫీ వూసెందుకు? అతని నిస్సహాయతా, నా నిర్లక్ష్యం చూచుకొంటూ వుంటే తేలు కుట్టినంత బాధ కలిగింది. ఇటువంటివాళ్లు దేశందాకా యెందుకు,వూళ్లో వీధి కెందరో?

అందరం వొక దీపస్తంభం దగ్గరకు వచ్చాం. ఆ పిల్లను పిలిచాను. ఏదో యిస్తానని ఆశతో వచ్చి చెయి చాపింది. జేబులోది తీసి చేతులో పెట్టాను. అది చూచి తెల్లపోయింది. నావంక కొంచెముసేపూ, చేతివంక కొంచెంసేపూ చూస్తూ యేమీ తోచక నిలబడి చివరకు "బాబూ! కానీ అనుకున్నారేమో అర్ధరూపాయి" అంది సందేహంగా. నేను యివ్వాలన్న భావంతోనే యిచ్చినట్లు 'ఔను తీసుకో! రేపొక డప్పు గూడా కొనుక్కోవచ్చునులే!" అన్నాను నవ్వుతా. పిల్ల సిగ్గుతో తల వాల్చింది. అంతా వింటూ వున్నతాత "నీలాంటి బిడ్డనే కను తండ్రీ!" అని దీవించాడు ఆనందం కళ్ల వెంట ప్రవహిస్తూ వుండగా.

ఇంటికి వచ్చేటప్పటికి వైరు:

—సుశీల ప్రసవించింది. మగచిన్నవాడు. తల్లీ బిడ్డలూ క్షేమం. రావలసింది.—

శ్రీ వేమన గ్రంథాలయము,
తెలప్రోలు.

# అభిప్రాయాలు

## యువకార్యాలయ ప్రచురణాలు

" ... ఇటువంటి ప్రచురణాలవల్ల తెనాలి యువకార్యాలయంవారు ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి చాలా తోడ్పడుతున్నారు... ఏవిధంగా ఆలోచించినా, ఆంధ్రప్రజయొక్క సహాయానికి తెనాలి యువకార్యాలయంవారు పూర్తిగా అర్హులన్న విషయం అందరూ గ్రహించాలి. "

—బుర్రా వెంకట సుబ్రహ్మణ్యం., " భారతి. "

"తెనాలి యువకార్యాలయమువారు కథలపుస్తకాలు ప్రకటించడానికి పూనుకోడము చాలా సంతోషమయిన విషయము ... అయితే 101 పేజీలపుస్తకము పావలాకు అమ్మకము చేస్తే ఏమి గిడుతుందో ఏమాత్రమూ ఊహించలేకుండా వున్నాను. "

—శ్రీ. శ్రీ., " ప్రజామిత్ర. "

## గుడిపాటి వెంకటచలం

" నవీన పాశ్చాత్య వాఙ్మయాలు ... చదివి తెలుగు వాఙ్మయంలోకి కొత్తపద్ధతులూ, కొత్తకథలూ తెచ్చిన మొదటి కథకుడీయనే "

—బు. వెం. సుబ్రహ్మణ్యం., " భారతి. "

" [illegible] !

[illegible] సాంఘిక నియమాచరణముల [illegible]గా, [illegible], అనంతమైన ప్రాణాపాయాలతో [illegible] కష్టకాలంలో, [illegible] పోతనంపట్టి అసహాయ్యులను ఉద్ధరించడానికి నడుముకట్టుకొని నిలబడిన [illegible] ... "

—హల్లాది గోపాలకృష్ణ శాస్త్రి, " కృష్ణా. "

## కొడవటిగంటి కుటుంబరావు

"కుటుంబరావు రచనలు స్వతంత్రమైనవి. ఆయన తన కథావస్తువులు ఇతర కావ్యప్రపంచములోనుంచి తీసుకోక లోకమనే మహాకావ్యములోనుంచిన్నీ తన ఊహలోనుంచిన్నీ తీసుకుంటాడు."

—"ప్రతిభ."

## మునిమాణిక్యం నరసింహారావు

"ఇంతవరకూ తెలుగులో సాంసారికకథలు వ్రాసినవారు .. మునిమాణిక్యం నరసింహారావుగారొక్కరే."

—శ్రీ. శ్రీ., "ప్రజామిత్ర."

"ఆంధ్రదేశంలో; కథలువ్రాసేవారు బహుకొద్దిమంది ... అంటే స్వతంత్రంగా రచించేవారని భావం ... మునిమాణిక్యం గారు ఇట్టితరగతికి చెందినవారు."

—న. కుటుంబరావు., "భారతి."

## పిల్లలమఱ్ఱి బాలకృష్ణశాస్త్రి

"కేవల సాంసారికకథలు వ్రాయడములో, అందునా అత్యుత్తమముగానూ అతిమనోహరముగానూ వ్రాయడములో యీ కథకుడు అగ్రసరుడుగా తోస్తున్నాడు ... ఈపుస్తకము వచ్చిన తర్వాత తెలుగులో ... యింత చక్కగా వ్రాయగలవారున్నారా ... అనిపించింది."

—శ్రీ. శ్రీ., "ప్రజామిత్ర."

"ఆధునికాంధ్ర కథకులలో ఎన్నదగినవారిలో బాలకృష్ణశాస్త్రిగారు ఒకరు."

—"ఆంధ్రభూమి."

TPLA105 B170 120

అచ్చులో ఉంది. త్వరపడండి.

శ్రీ గుడిపాటి వెంకటచలంగారి

అమోఘమైన రచన

# బ్రహ్మాణీకం

పెద్దకథ

యువ కార్యాలయంవారి ఏడవ ప్రచురణంగా వెలువడబోతూ ఉంది. ఇందులో కొంతభాగము "వినోదిని" లో ఖండములుగా వెలువడింది. ఈ కథను సొంతముగా చదవగోరేవారికీ, దీనిని పుస్తక రూపముగా తమవద్ద ఉంచుకో గోరేవారికి మంచి అవకాశము కలిగించుతున్నాము, కనుక ఇప్పుడే కాపీలకొరకు త్వరపడండి.

వెల నాలుగుఅణాలు మాత్రమే

పోస్టుఖర్చులు అణా.

యువకార్యాలయం, తెనాలి.

గుంటూరుజిల్లా.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA105B170 |
| పుస్తకం పేరు | కలక |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 121 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | pragathi |
| పేజీలు విడదీసినది | pragathi |
| స్కాన్ చేసినది | prathyusha |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | NO |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |